# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్రము

నెవడు ప్రేమింప నేర్చునో యాతఁడే ధన్యుఁడు. ఒకపరి యైహికములను లోంగి తనువునకుఁ జనువిచ్చితిమా నావ్యామోహమునుండి విడివడుట కెన్నియో జన్మముల నెత్తవలసి వచ్చును. అందువలన మాంసధూయిష్ఠమగు నీ యస్థిపంజరముపైన అనురాగ ముంపకుము. జగన్మాత చరణ కమలమే మనకు తారకము. ఆమెనే సర్వదా స్మరించుచుండుము. దాన నీజీవితము సార్థకము కాఁగల"దని యుపదేశము చేసెను. నాగమహాశయులు తాపసి. ఆమన సహధర్మిణి తపస్విని యయ్యెను.

ఇట్లు దినము లతిక్రమింపఁగా దీనదయాళుని దేహ మనారోగ్య స్థితికి వచ్చెను. నాగమహాశయులు తనతండ్రి "మెస్సర్సు పాలుల" కొలువు నింక విరమించుకొని మిగిలినకాల మీశ్వరాన్వేషణమున గడపవలయునని యనుకొనెను. కొమరుడు చాల ప్రార్థింపఁగా దీనదయాళు సెలవు తీసికొని జన్మస్థానమునకుఁ బోవుట కియ్యకొనెను. కోడలు గూడ మామగారికి పరిచర్యఁ జేయుటకై నతనితో బోయెను.

సురేశుఁడు యథాప్రకారముగ నాగమహాశయులతో మత విషయక చర్చలఁ జేయుచుండెను. కాని మాటలవలన లాభము లేదని నాగమహాశయులు తెలుసుకొనెను. అందువలన నొక దినమున సురేశునితో "వాద ప్రతివాదముల వలనఁ గాలమంతయు వ్యర్థమై పోవుచున్నది. ప్రత్యక్షముగ నేనో యొకటి కన్గొనకున్నచో జీవితము సార్థకత బడయజాల"దనెను.

ఈ కాలముననే సురేశు డొకనాడు కేశవబాబు స్థాపించిన నవవిధాన సమాజమునకుఁ బోయియుండగా నచ్చట, సర్వసంగ ప

త్యాగియై, సదా భగవద్ధ్యానపరుఁడై తరచు భావసమాధులఁ జెందుచుండిన యొక సాధువు దక్షిణేశ్వరమున నివసించుచుండెనని వినెను. సురేశుఁడు, మహాశయునితోఁ గూడ నా యోగిపుంగవుని సందర్శింప పోవలె ననుకొనెను. కాని కారణాంతరమువలన నాసంగతిని అప్పుడు మహాశయుని కెఱుక పరుపకయే యుండి రెండు నెలలయిన తరువాత చెప్పెను. నాగమహాశయులు చాల యాతురతతో తత్క్షణమే యాతని దర్శింప బోవలె ననెను. నాడిక నెంతో ప్రొద్దు లేకుంటచే మరునాఁడుదయముననే ప్రయాణము చేయుటకు సమకట్టెను.

మరుసటి ప్రాతఃకాలమున భోజనములఁ గావించి బయలుదేరిరి. దక్షిణేశ్వరము కలకత్తా కుత్తరమున నుండెను. అందుచే వారా వైపున కున్ముఖులైరి అప్పుడు ఎండలు మెండుగ నుండెను. వేడిమికి కొంచెమైనను లెక్కసేయక నేదియో శక్తి తమ్మీడ్చుకొని పోవుచున్నట్లు పోవుచుండిరి. చాల దవ్వేగిన తరువాత నొక పథికుని దక్షిణేశ్వరమెచ్చట యని ప్రశ్నించిరి. ఆతఁడా యూరు దాటి చాలా దూరము వచ్చినారనెను. పాపము వారలు మరల వెనుకకు మరలిరి. రాణి వాశీ రాస్మొని యొక్క కోవెల గృహమును చేరుసరికి మధ్యాహ్నము రెండు గంటలాయెను.

ఆ కోవెల చుట్టును చల్లటినీడను బఱపుచు సుగంధమును వెదచల్లుచు నొక పూఁదోఁట యుండెను. ఆమిత్రులకు దక్షిణేశ్వర దేవాలయము దేవగణము యొక్క లీలాభూమివలెనే గన్పట్టెను. చల్లని నీటితో నిండి యాలయప్రాంగణమున నున్న తటాకమును, ఎత్తైన శిఖరములు గల నాకోవెలలను, చిగురుటాకుల నొడఁగిన వృక్షసమూహములను చూచుచు ఆ మిత్రులు చాల నానందించిరి. మహాశయులకా వృక్షముల యాకుల ఒరపిడియం దొక సుకుమారవాణి తమ్ముఁ "సంసార సాగరమున మునిగి

పోవుచున్న యో జీవులారా! మిమ్ముల దరిజేర్పగల నావ యచ్చట నున్నది." యని యాహ్వానముఁ జేయుచున్నటులుండెను.

ఇక నీ ప్రకృతి చిత్రములఁ దిలకించుట మాని నెమ్మదిగ వారు శ్రీరామకృష్ణులు నివసించుచుండిన గదిని జేరిరి. ద్వారమున నొకగడ్డపు మానిసి యుండెను. "అయ్యా! దక్షిణేశ్వరసాధు నెచ్చట నుండును." అని ఆతనిని వారడిగిరి. "అతని నివాస మిచ్చటనే కాని ప్రస్తుత మాతడు చంద్రనగరమునకుఁ బోయియున్నాడు. మీరింకొక దినమున వచ్చుట మంచిద"ని యాతఁడు ప్రత్యుత్తర మొసఁగెను.

ఇర్వురును హతాశులై, ఖిన్నవదనములతో నన్యోపాయము లేక వెనుకకు మరల నుండు సమయమున మహాశయులు తమ్మెవ్వరో లోనికి వచ్చుటకు సంజ్ఞ చేయుచున్నటుల జూచెను. దక్షిణేశ్వర యోగి యతడే నా యేమి? అవును. ఏమహాత్ముని దర్శింప వారా యాతప మును లెక్క సేయక యరుదెంచిరో యామహాత్ముఁ డాతఁడే కావచ్చును. ఆగడ్డపుమానిసి మాటల సరకుగొనక వారు లోనికి ప్రవేశించిరి.

ఆ గడ్డపుమానిసి ప్రతాపచంద్ర హజ్రా. ఆతని కొరులెవ్వరును శ్రీరామకృష్ణుల వద్దకు వచ్చుట గిట్టదు. అయినను భగవంతునిప్రేమ ప్రవహించుచుండ నా ప్రవాహమున కడ్డుగ నెవరు నిల్వగలరు? ఆ ప్రేమయే లేనిచో, భగవంతుడు ప్రక్కన నిలుచొనియున్నను తెలిసికొనుట యశక్యము. ఇది శ్రీరామకృష్ణుల జీవితమందలి యొక వృత్తమును జ్ఞప్తికిఁ దెచ్చును.

ఒకనాడు శ్రీరామకృష్ణులు తన మేనల్లుడగు హృదయముఖో పాధ్యాయునితో కాళీ ఘట్టమునకుఁ బోయెను. అచ్చటి దేవాలయ మున కుత్తరపుతట్టు కచ్చూరపు (కచుచెట్లు) పొదలుండెను. అప్పు

# శ్రీ రామకృష్ణ సందర్శనము

జగన్మాత కొందరు చెలికత్తెలతో జన్మనిచ్చి యాడుకొనుచుండుటను శ్రీరామకృష్ణులు చూచెను. ఆమె రాత్రంను చీరను ధరించి యుండెను. గొల్లభామలను పట్టుచు నాడుచుండెను. అంత నాత "యమ్మా! యమ్మా!" యని కేకలిడుచు చైతన్య విహీనుఁడయ్యెను. మరల స్మృతి వచ్చిన తరువాత శ్రీరామకృష్ణులు దేవాలయములోని కేగి చూడనా కాళికావిగ్రహమున కచ్చట తానుజూచిన వస్త్రమే కట్టబడియుండెను. హృదయుడీ సంగతిని విని "మామా, నాకప్పుడే ఎందులకుఁ జెప్పవైతివి? నేనుపోయి యామె నప్పుడే పట్టుకొనియుందునుగదా!" యనెను గురుదేవు డిందులకు నవ్వి "నాయనా! అదియెన్నటికిని పొసగదు. ఆమె ఇచ్ఛలేక యామెను పట్టుకొనుటకు నీకేటి శక్తి? సర్వవ్యాపిణియైనను ఆమెకృపకు పాత్రులుగాక యెవ్వరు నామెను గన్గొనఁ జాలరు" నెను

# శ్రీ రామకృష్ణ సందర్శనము

సురేశ నాగమహాశయు లిర్వురును లోనికిఁ బ్రవేశించిరి. శ్రీరామకృష్ణులొక మంచముపై కాళ్లు చాచుకొని కూర్చొనియుండెను. ఉత్తరాభిముఖుడై చిఱునవ్వు నవ్వుచుండెను. సురేశుడు చేతులు జోడించి నమస్కరించి చాపపై గూర్చుండెను. మహాశయులు హిందూ మతాచారరీతి సాష్టాంగమెఱిగి యాయన పాదధూళిని స్వీకరింపఁబోయెను. కాని శ్రీరామకృష్ణులు పాదముల వెనుకకు లాగుకొనెను. ఇది మహాశయులకు దుర్భరమైన దుఃఖకారణ మయ్యెను. నిజమైన భక్తుడెవ్వడు నట్టి హక్కును బోగొట్టుకొన జాలఁడు. తానట్టి పవిత్రస్పర్శ కనర్హుడనని నాగమహాశయులు సమాధాన పరచుకొని అగదియందు దూరముగ నొక్క మూల గూర్చుండెను.

# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్రము

శ్రీరామకృష్ణులు వారి పూర్వోత్తరములగూర్చి కొన్ని ప్రశ్నల నడిగెను. కొంతకాలము వారితో మాటలాడి సంభాషణానంతరమున "జుమ్మరి పుర్వు మంటిలో నున్నను పంకిలముగాక స్వేచ్ఛగ నున్నట్లు మీరలును గృహస్థులై యుండఁదగును. సంసారపంక మేమాత్ర మంట కుండునట్లు మాత్రము జాగ్రత వహించియుండు"డనెను.

నాగమహాశయునికి గృహస్థ ధర్మనిర్వహణ సమస్యయే ఇంతవఱకు బాధించుచుండెనందున ఈ యుపదేశమాతని మనమున గాఢముగ నాటుకొనెను. చాల నాశ్చర్యముతో నాతఁడు శ్రీ గురుదేవుని తదేకదృష్టితో జూడసాగెను. "ఏల యిట్లు జూచుచున్నావని" శ్రీరామకృష్ణు లడిగిరి. మహాశయులు "అయ్యా! మీ దర్శనమునకు జాల నాతురత పడితిని. నేటికా భాగ్యము లభించినందున తనివిదీర జూచుచున్నా" ననెను.

కొంతవడికి శ్రీరామకృష్ణులా మిత్రద్వయమును పంచవటికిఁ బోయి ధ్యానమొనర్పుమని పంపెను. అట్లే సురేశమహాశయులిర్వురొక యరగంట వరకు ధ్యానోపవిష్టులై మగిడియేతెంచిరి. తరువాత శ్రీరామకృష్ణులామిత్రులు తన వెంటరా, నచ్చటి దేవాలయముల నన్నిటిని జూపుటకు బయలుదేరెను.

శ్రీరామకృష్ణుని గదినంటి పండ్రెండు శివాలయములుండెను. ఒక్కొక్క దానియందును ప్రవేశించి శ్రీరామకృష్ణులు స్వామికి ప్రదక్షిణము సల్పి సాగిలపడి నమస్కరించెను. మహాశయులును ఆతని ననుసరించెను. కాని సురేశుడు బ్రాహ్మమతావలంబి యగుటచే నా విగ్రహములయందు నమ్మకలేక వారి చర్యలను నడవడిని జూచుచుండెను. తరువాత శివాలయముల కొకింత దూరముననున్న విష్ణ్వాల

యములఁ బ్రవేశించిరి. అచ్చటగూడ పూర్వోక్తముగనే మెలఁగిరి. అటనుండి జగన్మాత దేవాలయమునకుఁ బోయిరి. జగన్మాత దేవాలయమును ప్రవేశింపగనే శ్రీరామకృష్ణుఁ డొక క్రొత్తవానివలెనై పోయెను. భావప్రపూర్ణుఁడై వడకసాగెను. తన్నుదామరచి నట్లగపడుచుండెను. తుంటరిబాలుడు జనని చీరచెఱఁగు బట్టుకొని యామె చుట్టునుఁ దిరుగునట్లు జగజ్జననిచుట్టు ననేకమారులు ప్రదక్షిణములు సల్పెను. శివశక్తుల పాదములను తనశిరముతో స్పృశించి తనగది వైపు మరలెను. జగన్మాతయందలి ఈతని గాఢమగు నమ్మకమును, బాలుని వంటి యస్వతంత్రతయు మహాశయుల మంత్రముగ్ధునిఁ జేసి వైచెను. భావోద్రిక్తుఁడై యూరక నాతనిపవిత్రభావములఁ దిలకించుచుండెను. సాయంతన మైదు గంటలకు మిత్రులిర్వురును ప్రయాణోన్ముఖులై శ్రీరామకృష్ణుల సెలవుఁ గోరిరి. శ్రీరామకృష్ణులు "తరచుగ రాకపోక లుండుచో సంబంధము చాల సన్నిహితమగు"ననెను.

మార్గమధ్యమున మహాశయులు శ్రీరామకృష్ణుని వ్యక్తివిశేషమును గూర్చియే తలపోయుచు నాలోచనా నిమగ్నుఁడయ్యెను. "ఆతఁడు యోగియా, సిద్ధపురుషుఁడా, లేక కేవల మా భగవన్మత్తుఁడా?" ఈ సందేహ మాతని నావరించెను. ఆ శుభదినము నాటి యనుభవము లాతని హృదయమున నాటుకొని యాతని మనమున భగవద్దర్శనాకాంక్ష అగ్నివలె రగులసాగెను. ఆభావ మాతని యున్మత్తునిఁ జేసెను. నిద్రాహారములకు దూరమై యన్య సంస్పర్శమును రోయుచు నొక్క సురేశునితో మాత్రము శ్రీరామకృష్ణ చరిత్రముఁ జర్చించుచు నేకాకియై యుండెను.

మరుసటి వారమున మిత్రు లిర్వురును మరల శ్రీరామకృష్ణుల వద్దకుఁ బోయిరి. ఆయన మహాశయుల యున్మత్తావస్థను చూచినంతనే

భావపరవశుడై "మీరిచ్చటికి వచ్చుట మంచిపనియే యైనది. మీ యందరికొఱకును వేచియుండు" ననెను. మహాశయులం జేరదీసి ప్రేమపూరితవచనముల "నాయనా! నీవు భయపడ నవసరము లేదు. నీ వత్యున్నత పదవికి వచ్చియున్నావు" అనెను. ఆ దినముననుగూడ వారలను పంచవటికి భగవద్ధ్యానమునకై పంపెను.

వారు పంచవటికిం బోయిన కొంతసేపటికి శ్రీరామకృష్ణు లచ్చటికేగి మహాశయులను తనకు పొగాకు చిలుమును తయారుచేయు మనెను. మహాశయులా పనిపై బోయినతరవాత సురేశుని జూచి "మహాశయులు ప్రజ్వలితాగ్ని సుమా" యనెను. ఇంతలో మహాశయులు చిలుమును గొనితెచ్చెను. తరువాత నుత్తరీయము, కూజా, కూజాయందు జలము మొదలగువానిని ఒక్కొక్కదానినిగా చెప్పి తెప్పించుకొనెను. నాగమహాశయులు తనకట్టి మహాపురుషుని సేవ లభించెంగదా యను సంతోషమును వెనుకటి పర్యాయమాయన తనకు పాదధూళి నీయు నిరాకరించెనను విషాదమును పెనగొన నమ్రతతో నా కార్యముల నన్నిటిని నెఱవేర్చెను.

నాగమహాశయు లింకొకసారి యొంటరిగ శ్రీరామకృష్ణులం జూడనేగెను. పూర్వమువలెనే యాయన భావసమాధిం బొందెను. తరువాత నేదియో గొణుగుచు లేచి నిలబడెను. ఆతని యీస్థితిం జూచి నాగమహాశయుడు భయభ్రాంతుం డయ్యెను. అంత శ్రీరామకృష్ణు "డయ్యా! మీరు వైద్యులు గదా! కొంచెము నా పాదముల పరీక్షింపుడు" అనెను. శ్రీరామకృష్ణులు తన సాధారణరీతిని మాటలాడు చుండుటంజూచి మహాశయులు ధైర్యము దెచ్చుకొని చరణములం బరీక్షించి దోషమేమియు లేదనెను. శ్రీరామకృష్ణులు "మరల జాగ్రత్తగ పరీక్ష సేయు"డనెను. నాగమహాశయులు శ్రీరామకృష్ణుని యభిప్రాయ

మును తెలిసికొని గురువు శిష్యుల యభిమతములను దీర్చుట ఇట్లే గదా యని సంతోషపడెను. గురువుయొక్క కొంచెపు టుదార ప్రవర్తనము సచ్ఛిష్యుని అతిగాఢముగ ప్రేమపాశములచే గట్టివేయును. ఇక నాగ మహాశయులవంటి శిష్యునిగూర్చి వేరుగఁ జెప్పవలయునా? ఆతని మనఃక్లేశ ముపశమిల్లెను. ఆ పరమపవిత్ర చరణ ద్వంద్వ స్పర్శమున తాను ధన్యాత్మునైతినని భావించెను. చక్షుద్వయమ్మునుండి సంతోష బాష్పధారలు ప్రసరించుచుండ నా పదముల శిరముపైనను హృదయము మీద నిడికొనెను.

గురు శిష్య సంబంధము బాగుగ దెలిసికొనిన వారలే ధన్యాత్ములు. వారలకు భగవత్సాక్షాత్కారము కలుగఁగలదు. ఈసరికి మహాశయులు శ్రీరామకృష్ణుని భగవదవతారమని తెలిసికొనెను. ఈ రహస్యమును నీవెట్లు తెలిసికొనగలిగితివని యడుగ "నేను శ్రీరామ కృష్ణునివద్దకు పోయిన కొన్నినాళ్లకాయన కృపాలేశమువలన నా మహామహుడు శ్రీమన్నారాయణుడే యనియు దక్షిణేశ్వరమున నాయన లీల రహస్యముగ జరుగుచున్నదనియు తెలిసికొంటి"ననెను. మరియు "నా దేవదేవుని యవ్యాజకరుణాకటాక్షమునచే దప్ప వేయి సంవత్సరములు తలక్రిందుగ తపస్సుచేసినను ఆయనను తెలిసికొన జాల" రనెను.

ఇంకొక దినమున నాగమహాశయులు శ్రీరామకృష్ణునిఁజూడ దక్షిణేశ్వరమునకుఁ బోయెను. అప్పుడాయన భోజనముచేసి విశ్రాంతి తీసికొనుచుండెను. అది మే నెల యగుటచే మిగుల నుక్కపోతగ నుండెను. అందువలన మహాశయుని తనకు విసరుచుండుమని చెప్పి శ్రీరామకృష్ణుడు నిద్రపోయెను. మహాశయులు చాలసేపు విసరుచుండి నందున చేతులు నొప్పియెత్తినను గుర్వాజ్ఞ లేనిదే నిలుపజాలక విసరు

చునేయుండెను. అంతకంతకు చేతులు బరువెక్కి ఇక వీవనను పట్టు కొనజాలనంతటిస్థితికి వచ్చునప్పటికి శ్రీరామకృష్ణు లాతని కరమును బట్టుకొని వీవనను తీసికొనెను. ఈవిషయమునుగూర్చి చెప్పుచు మహాశయులు "ఆయన నిద్ర యసాధారణము. ఆయన ఎల్లప్పుడును (నిద్ర పోవుచుగూడ) మేల్కొనియేయుండును. ఈస్థితి భగవంతునికి దక్క నితరుల కెవరికిని తుదకు సిద్ధులకుగూడ సాధ్యము కా" దనెను.

ఒకపరి శ్రీరామకృష్ణుడు నాగమహాశయుని తన్నుగూర్చి యాతని యభిప్రాయ మేమని యడిగెను. నాగమహాశయుడు "దేవా! నీ కృపాకటాక్షములన నీవు భగవంతుడవే యని తెలిసికొంటిని" అనెను. ఇది విని శ్రీరామకృష్ణుడు సమాధి నిమగ్నుడై యాతని వక్షమును తన కుడిపాదముతో స్పృశించెను. ఈచర్య నాగమహాశయుని యందొక మార్పును గలుగచేసెను భూమ్యంతరిక్షములనిండి చరాచర ప్రపంచము నాతయు వ్యాపించిన యొకమహాజ్యోతి యాయనకు గనిపించెను. తరువాత తరువాత శ్రీరామకృష్ణునిగూర్చి తనయభిప్రాయమును దెల్పుచు "ఆయనను దేనికొఱకును ప్రార్థింపనక్కర లేదు ఆయన కల్పతరువు. మనయభిప్రాయములను చెప్పకయే ఎఱిగి వానిని సఫలీకృతముచేయును. శ్రీరామకృష్ణులు భూమి నవతరించినది మొదలు సకలమును కొట్టుకొనిపోవు నొక మహావెల్లువ వచ్చియున్నది. ఆతడు భగవంతుని సంపూర్ణావతారము. ఇంతదనుక సర్వమత సామరస్యము నింత విపులముగ నిరూపించిన యవతార మింకొకటి వచ్చియుండలే" దనువారు.

మహాశయులకు వివేకానందస్వామితోడి ప్రథమ పరిచయము దక్షిణేశ్వరమునఁ గలిగెను. అప్పటి కాతఁడు నరేంద్రుఁ డను నామమున పిలువఁబడుచుండెను. ఒక నాఁడు మహాశయులు శ్రీరామకృష్ణులయెదుట

## మంత్రోపదేశము - దక్షిణేశ్వర యాత్ర

గూర్చొనియుండగా నరేంద్రుఁడు "శివోహం" "శివోహ" మ్మని యుచ్చరించుచు గదిని ప్రవేశించెను. అంత శ్రీరామకృష్ణులు మహాశయుల వ్రేలితోఁ జూపుచు "నరేంద్రా! యీతఁడు అహంకార రహితుఁడు. ఇది యాతని సహజ స్వభావముగాని నటనకాద"నెను. "మీరట్లు చెప్పినచో నది వేరొకవిధముగ నుండఁజాల"దని నరేంద్రుఁడనెను. ఆశిష్యద్వయ మంత నిట్లు సంభాషించుకొనసాగిరి:—

నాగ :—సకలమును జగన్మాత ఇచ్ఛామాత్రము చేతనే జరుగుచుండును. ఆమె ప్రపంచాతీతమగుశక్తి. ప్రతికార్యము నామెయే జరపుచుండును. కాని మనుజులు తాము చేయుచున్నా మనుకొందురు.

నరేం :—నీవు చెప్పు ఈ "ఆమెను" నే నొప్పుకొనజాలను. ఆత్మను నేనే. నాలోననే సకల చరాచర ప్రపంచముఁగలదు. నాలోననే యది పుట్టి పెరిగి లయించుచుండును.

నాగ :—నీవొక తెల్లని వెంట్రుకను నల్లగఁ జేయుటకైనను శక్తిలేదు. ఇక ప్రపంచము మాట యేమి? ఈశ్వరేచ్ఛ లేనిదే గడ్డిపోచ యైనను కదలదు.

నరేం :—నా సంకల్పము లేనిదే సూర్యచంద్రాదులు తిరుగ జాలరు. సృష్టిచక్రమును నడుపుచుండునది నాసంకల్పమే.

ఈ సంభాషణ నంతయు నాలకించుచుండిన శ్రీరామకృష్ణులు మహాశయులఁ జూచి "నరేంద్రుఁడట్లనఁగలఁడు. ఆతఁ డొరనుండి తీసిన ఖడ్గము. అతఁడు అట్లు చెప్పుట అహంభావమువలన కాదు" అనెను. శ్రీరామకృష్ణుని మాటలు విని మహాశయులు నరేంద్రుని పాదములకు నమస్కరించి యూరకుండెను. అప్పటినుండి, నరేంద్రుఁడు శ్రీరామ

కృష్ణుని లీలకొఱకై యవతరించిన శివుఁడేయని భావించెను. ఒకపరి యొకానొకఁడు మహాశయులను "నీవెప్పుడైనను ముక్తపురుషునిఁ జూచి యుంటివా?" యని ప్రశ్నింపఁగా యాతఁడు వెంటనే "అనేకులకు మోక్షమును ప్రసాదించిన శ్రీరామకృష్ణునిఁ జూచితిని. శివుని యవతారమగు వివేకానందస్వామిని జూచితిని" అనెను. వాస్తవముగ నీతని విశ్వాసము పర్వతములను, చలింపఁజేయఁజాలియుండెను. శ్రీరామకృష్ణుని ముఖమునుండి వెలువడు ప్రతివాక్యమును ఆయనకు వేదవాక్యము. పరిహాసమున నాడినమాటలుఁగూడ నాతనికి ప్రమాణములే. "నేను అల్పజ్ఞుడను. ఆయననెట్లు తెలిసికొనఁగలుగుదును" అనువాఁడు.

ఒకమారు శ్రీరామకృష్ణులు శిష్యులతో "వైద్యులకును న్యాయవాదులకును నడిబేరగాండ్రకును పారమార్థిక సత్యముల తెలిసికొనుట కష్టము" అనెను. ముఖ్యముగా వైద్యులను గూర్చి "మందుచుక్కలపై నిలకడగొన్న మనస్సు బ్రహ్మాండమైన యాప్రకృతి నెట్లు తెలిసికొనగలదు"ని చెప్పుచుండ మహాశయులు వినుట తటస్థించెను. ఈకాలముననే నాగమహాశయుని ధ్యానసమయములందు రోగుల స్వరూపములు జ్ఞప్తికివచ్చి ధ్యానము చెడిపోవుచుండెను. అందువలన నీ హితవాక్యము తన్నుద్దేశించియే చెప్పబడెనని యాతఁడు తలంచెను. పారమార్థిక పథమున నంతరాయమగు నావృత్తిని తత్క్షణమే విడనాడవలయునని నిశ్చయించుకొనెను. ఇంటికరిగి యాదినమే తనమందుల పెట్టెను వైద్యగ్రంథములను గంగానది యందు బడవైచి స్నానమాచరించి గృహమునకు వెడలెను.

దీనదయాళున కీవార్త తెలిసెను. తోడనే యాతఁడు కలకత్తాకు వచ్చి తనకొమరుని తనస్థానమందు నియోగింపుడని "మెస్సర్సు పాలు

ల"ను కోరెను. అట్లే వారు నియమించిరి. దీనదయాళు కలకత్తాను వీడిపోయెను.

నాగమహాశయుని పని చాల స్వల్పము. అప్పుడప్పుడు మాత్రము బాగుబజారునకును కిడ్డర్‌పూరు కాలువలకును బోవలసి యుండును. ఈపనియందు ప్రవేశించిన తరువాత నాతనికి దక్షిణేశ్వర మునకుఁబోవుటకు కావలసినంత తీరిక యుండెడిది. ఆయన ధ్యానకాలము నాడు నిష్కడెక్కువయయ్యెను. ఆతనిగృహమందు పరిశుభ్రమైన యొక స్థలమున నొకపాత్రయందు పవిత్రగంగాజలము నుంచి గంటల తరబడి ధ్యానవిమగ్నుడై యుండును.

పనిమీద బాగుబజారునకు బోయినప్పుడా తోటలో నొక ఏకాంతప్రదేశమున భగవద్ధ్యానము సల్పుచుండును. ఒకనాడిట్లు ధ్యానోపవిష్టుడై యుండ నాతనికొకయద్భుతసాక్షాత్కారమయ్యెను. గృహమునకు మరలివచ్చినతరువాత సురేసునితో తా నెప్పుడును ధ్యానమున నట్టి యానందముఁ బొందలేదని చెప్పెను.

శ్రీరామకృష్ణుని సాంగత్యబలమున నాతనికి విరక్తిభావము హెంపొందసాగెను. తత్క్షణమే ప్రపంచసుఖములను విడనాడి సన్న్యాసమును స్వీకరింపవలెనని యెంచి శ్రీరామకృష్ణుని యనుమతి నడుగుటకై యాతఁడొకనాఁడు దక్షిణేశ్వరము వెళ్లెను. శ్రీరామకృష్ణుఁడు అప్పుడే సమాధినిమగ్నుఁడై ఇట్లు చెప్పుచుండెను. "గృహస్థజీవితమున గల లోపమేమి? మనస్సును ఎల్లప్పుడును భగవంతునియందే లగ్నము చేసియుంచుము. గృహమేధిజీవితము కోటలోనుండి యుద్ధముచేయుట వంటిది." ఏదివ్యశక్తి తనయందీ తీవ్రసన్న్యాసభావమును రగుల్పజేసెనో యదియే ఇప్పుడు జనకచక్రవర్తివలె గృహస్థధర్మమున నుండుమని

దారిజూపుచుండెను. శ్రీరామకృష్ణుఁడు తరువాత నిట్లు చెప్పెను. "నీ జీవితము గృహస్థుల కందఱకు నాదర్శప్రాయముగ నుండగలదు." ఇది గుర్వాజ్ఞ గావున నాతఁడు శిరసావహించెను.

నాగమహాశయులీ యాజ్ఞను శిరసావహించినను మనస్సునందలి యల్లకల్లోలమింకను నడంగలేదు. మనస్సును నిశ్చయపరచుకొనజాలక రేయింబవళ్ళు భగవంతుని ప్రార్థించుచు "హా జగన్నాథా, పరమేశ్వరా" యని నిట్టూర్పుల పుచ్చుచుండెను. మంటలో పడి పొరలును. ముండ్ల పొదలపైబడి దేహమంతయు గాయపరచుకొనును. ఆహారముపై యిచ్చ పూర్తిగ నశించెను. సురేసుడు బలవంతముగ తినిపించినసే తప్ప నాతఁడు భుజించి యెఱుఁగఁడు. తనయం దేమి జరుగుచుండెనో కూడ నాతనికి తెలియదు. ఆతఁ డెచ్చటికిఁబోవునో కూడ నెవ్వరు నెరుఁగరు. ఒక్కొక్కప్పుడు పోయినదే పోకడగఁబోయి తెల్లవారుఝామున రెండుగంటలకువచ్చును. ఇట్లు తన కాలమంతయు మతిభ్రష్టుని వలెఁ గడపుచు తనకు నియమించిన స్వల్పకార్యములను గూడ నిర్వర్తింపఁజాలకుండెను. అందువలన నీతనితో కొలది పరిచయమున్నట్టియు, యోగ్యుఁడునైన రంజిత్ హాజ్రాయను నింకొక యుద్యోగి యీతని కార్యములను నిర్వర్తించుచుండెను.

ఈ సమయముననే నాగమహాశయు లొక కొంతకాలము తన జన్మస్థానమునం దుండుట తటస్థించెను. ఈతని విషమస్థితిని జూచి భార్య భయభ్రాంత యయ్యెను. తన భర్తకు సంసారేచ్ఛ పూర్తిగ నశించినదని తెలిసికొనెను. నాగమహాశయుఁడు గూడ తాను శ్రీరామకృష్ణుని పాదములను శరణు జొచ్చిన పిదప కుటుంబమునకై ప్రాపంచికాసక్తుఁడగుట దుర్లభమని చెప్పెను.

# మంత్రోపదేశము - దక్షిణేశ్వర యాత్ర

నిక్కముగ శ్రీ రామకృష్ణుని జూచినది మొదలు నాగమహాశయుని మనస్సు ప్రపంచమునకు సంపూర్ణముగ విముఖమయ్యెను. అప్పటి యాతని మనఃస్థితిని విశదపఱచుటకొక సంఘటనము నిట తెల్పెదము. నాగమహాశయుని సోదరి తోటయందొక అనప పాదును నాటియుండెను. పొరుగింటివాఁడు ఆపాదునకొకింత దూరమున తనయావును కట్టియుంచెను. త్రాడు చాల పొట్టి యగుటచే నాయావు ఆపాదును తినవలెనని ఎంత ప్రయత్నించినను అందలేదు. మహాశయులు దాని విఫలప్రయత్నములను జూచుచుండి ఆయల్పజంతువుపైని జాలిచేతనో లేక నాపవిత్ర గోమాతపైని భక్తిచేతనో ఏకారణముననో యాత్రాటిని విప్పి "యమ్మా తినుమ"మనెను. ఆగోవు తృప్తి తీరఁ దినుచుండెను. దీనినంతయు దూరమునుండి దీనదయాళు చూచుచుండెను. మనసు పట్టఁజాలక యాతఁడు కుమారునితో నిట్లనెను.

దీన:—నీవేమో కుటుంబమునకు నిస్సహాయుఁడవు. కుటుంబమునకు మేలుచేయకపోవుటయేగాక మీఁదుమిక్కిలి ఇట్టి నష్టమునుకూడ కలుగచేయుటకు నీకెట్టిధైర్యము! నీవు వైద్యవృత్తిని మానుకొంటివి ఇక ఆకలిపిశాచము నెట్లు తరుమగలవు?

నాగ:—ఆవిషయమై నీ వాయాసపడవలదు. సర్వవ్యాపకుఁడగు నా దేవదేవుడే మన యోగక్షేమములను వహింపఁగలఁడు.

దీన:—అవును! యీమాత్ర మెవరికిని తెలియకపోలేదు' నీకు కట్టుకొనుటకు గుడ్డయైన లేక కప్పలనుతినుచు దేశద్రిమ్మరిగ తిరుగవలసిన కాలము వచ్చినది.

మరల మాటాడక మహాశయులు కౌపీనమును తీసివైచి యొకచచ్చిన కప్పను తీసుకొనివచ్చి తినుచు తండ్రితో నిట్లనెను. "ఇప్పుడు

నీ యాజ్ఞలను రెండింటిని శిరసావహించితిని. దయయుంచి యికెన్నడును కుటుంబ పోషణమునుగూర్చి తలపెట్టకుము. భగవన్నామమును స్మరించుచు కాలమును గడపుము నేను తలవంచి ప్రార్థించుచున్నాను. ఈ ముదుసలి వయస్సునందు ఐహిక విషయములను ఎంతమాత్రమును తలపెట్టవలదు తండ్రీ" యనెను. దీనదయాళు కొమరునికి పిచ్చియెత్తినదని నిశ్చయపడెను. అందువలనఁ గోడలిని పిలిచి యిక నాతని యిచ్ఛకు వ్యతిరేకముగ నెన్నడును ప్రవర్తింపవలదని చెప్పెను.

మహాశయులు తన తండ్రియింట నున్నంత కాలము ఆయనను సంసారముమాట తలపెట్టనీయక యెల్లప్పుడును మతవిషయికములును భక్తిపూరితములునగు గ్రంథములను చదివి తండ్రికి వినిపించువాఁడు. మరియు తండ్రితో వ్యర్థసంభాషణల సల్పువారిని తిట్టి వారితో, నిక ముందెన్నడట్టి వృథాకాలయాపనము చేయవలదనియు లేకపోయినచో తన గృహమునకు రావలదనియు ఖండితముగ జెప్పువాఁడు.

మహాశయులు కలకత్తాకు మరలివచ్చిన తరువాత సురేశుఁడు దీనదయాళుని స్థితి యెట్లున్నదని యడిగెను. అంత మహాశయులు నిట్టూర్పుపుచ్చుచు "మనుజుఁడు ప్రాపంచిక విషవృక్షఫల మొకమారు చవిచూచినఁ జాలును. ఆతనిగతి యధోగతియే యగును. మహామాయ యనుగ్రహములేనిదే అతఁడు తరింపఁజాలఁడు" అనెను. తన తండ్రి దుఃస్థితిఁ దలఁచుకొని యేడ్చుచు, "జయశ్రీరామకృష్ణా జయశ్రీరామకృష్ణా జయశ్రీరామకృష్ణ ప్రభూ! నాతండ్రిని కటాక్షింపవా" యనెను. దుఃఖముపశమించిన తరువాత సురేశునితో తన తండ్రి యంత వృద్ధుఁడై కదలుట కశక్తుఁడైయుండియు ప్రాపంచికవిషయ లంపటుఁడై సదా యందే మునిగియుండును. మఱియు పొరుగువాఁడెవఁడైన వచ్చుచో వ్యర్థసంభాషణకై యువ్విళ్లూరు చుండునని చెప్పెను.

## మంత్రోపదేశము - దక్షిణేశ్వర యాత్ర

అటుతరువాత నొకసారి శ్రీరామకృష్ణుని దర్శింపఁబోయి యాయనతో "అయ్యా! నేనేల యింకను ఆభగవంతునికిని సంపూర్ణముగ నాత్మసమర్పణము చేసికొనలేకయున్నాను. ఇంకను పురుషప్రయత్నము పోకుండుటకు కారణమేమి?" అనెను. అందులకు శ్రీరామకృష్ణుఁడు తన్ను నిర్దేశించుచు "దీనియెడల నీకు భక్తికుదిరినచో అంతయు చక్కఁబడును" అని చెప్పెను.

నాగమహాశయుని గాఢమగు సన్న్యాసభావమును కనుఁగొని మరల శ్రీరామకృష్ణుఁడు "నీవు గృహస్థుఁడవై యే యుండుము. నీ కుటుంబ పోషణ మెట్లో జరిగిపోవుచుండును" అనెను.

నాగ:—గృహస్థుఁడనై యుండుట కెట్లు వీలగును? ఇతరుల కష్టములను జూచుచు చలింపకుండుట సాధ్యమా?

శ్రీరామ:—నేను చెప్పుచున్నాను వినుము. ఇంటిని వీడిపోకుము. సంసారము నిన్నంటఁజాలదు. నీజీవితమును జూచి యందరు నాశ్చర్యపడఁగలరు.

నాగ:—గృహస్థుఁడనై నేను నాదినముల నెట్లు గడుపవలెను?

శ్రీరామ:—నీవేమియుఁ జేయనక్కరలేదు. ఎల్లప్పుడును సజ్జనగోష్ఠి యందుండుము.

నాగ:—మందబుద్ధినైన నేను సజ్జన దుర్జనుల నెట్లు గుర్తింపఁ జాలుదును ?

శ్రీరామ:—నీవు వారికొరకై వెదకుచు పోవ నవసరములేదు. ఇంటియందే యుండుము. నీ కొరకై వారే వత్తురు.

ఇట్లు దినములు గడవగా నాగమహాశయులు తాను కుటుంబపోషణకై పాటుపడవలయునేని తనకు శాంతియెంతమాత్రమును చేకూరఁ

జాలదని తెలిసికొనెను. ఆ కారణమున తన పనినంతయు రంజితు హాజ్రా కప్పగించి తనకాలమును భగవద్ధ్యానమునం గడుప నిశ్చయించుకొనెను. ఒకనాఁడు సందర్భవశమున నీ సంగతి "మెస్సర్సు పాలుల" కుకూడ ఎరుకపరచెను. అంత వారు "అట్లయిన నీకుటుంబము నెట్లు పోషించుకొనఁగలుగుదు"వని యడిగిరి. "రంజిత హాజ్రా దయదలచి ఇచ్చిన స్వల్పముతోడనే పోషణ జరుపుకొందు" నని ప్రత్యుత్తరమిచ్చెను.

"మెస్సర్సు పాలులు" నాగమహాశయులిక కుటుంబమునకెట్టి సాయమును చేయఁజాలఁడని గ్రహించిరి. ఇంతకాలము తమపై నాధారపడియుండిన యీ కుటుంబమును పోషించు భారము తమదని రంజితుని పిలిచి యాతని సగపాలు రాబడి మహాశయుల కిచ్చునట్లు ఏర్పాటుచేసిరి. రంజితు సంతోషపూర్వకముగ నొప్పుకొనెను. కాని యాతఁడు మహాశయుని మనోభావమును బాగుగ నెరిగినవాఁడు కావున కుటుంబ భోజన ఖర్చులకు మాత్ర మాతనివద్ద నిచ్చి మిగిలిన పైకము నాతఁడు దీనదయాళునికిఁ బంపుచుండెను.

శ్రీ రామకృష్ణు లీ సంగతినివిని చాలసంతసించి "బాగుబాగు" అనెను.

ఇప్పు డన్నిబంధముల నుండియు విముక్తుఁడై మహాశయులు తన కాలమంతయు ధ్యానాదులందే గడపుచు, తరచు శ్రీ రామకృష్ణుని దర్శించుచుండెను. సాధారణముగా నాతఁడు ఆదివారమునాఁడును ఇతర సెలవు రోజులయందును దక్షిణేశ్వరమునకు వెళ్లువాఁడుకాఁడు. ఏలయన యట్టిరోజులయందు గొప్పగొప్ప స్థితిమంతులును విద్వాంసులును శ్రీ రామకృష్ణుని దర్శింప వత్తురు. వారితో మాటలాడుటకు తా నసమర్థుఁడనని యాతని నిశ్చయము కాని యిప్పుడా నియమమును వదలి తరచు పోవుచుండుటచే కొందరితో పరిచయము కలిగెను.

# మంత్రోపదేశము - దక్షిణేశ్వర యాత్ర

ఒకరాత్రి * గిరీశుఁ డితరులగు మిత్రులతో దక్షిణేశ్వరమునకు వచ్చెను. ఆతఁడు శ్రీరామకృష్ణుని గదిలోనికి ప్రవేశించి యచ్చట చేతులు జోడించుకొని చాల వినతభావముతో యొక మూల యొదిగి కూర్చొనియుండిన యొకవ్యక్తిని జూచెను. దేహము శుష్కించి వికారముగ నుండినను నేత్రములు శాంతియుతములై ప్రజ్వలించు చుండెను. గిరీశుఁ డాతఁడెవ్వరాయని నివ్వెరపడి చూచెను. అంత శ్రీరామకృష్ణుఁడు గిరీశున కాతని పరిచయపరచెను. ఆశుభ సమయమునుండియే గిరీశ మహాశయు లిద్దరును ప్రాణమిత్రులై యుండిరి.

నాగమహాశయులు సాయంతనముల దరచు గంగానదీ తీరమున గడపువాఁడు. ఒకనాఁడట్లు నదీతీరమున నడయాడుచుండ నొకవర్చస్వియగు యువకునిగాంచెను. యువకుని జూడఁగనే మహాశయు లాతఁడు శ్రీరామకృష్ణుని భక్తుఁడై యుండవలయు ననుకొనెను. యువకుని ప్రశ్నింప నాతనియూహ సత్యమయ్యెను. ఆతఁడు తురీయానంద స్వామి (అప్పుడు హరిమహారాజ్). నాగమహాశయు లాతని కఠోర బ్రహ్మచర్యమునుగూర్చి చెప్పుచు "ఇట్టివాఁడు గనుకనే శ్రీ గురుదేవుని కృపకుఁ బాత్రుఁడయ్యె"ననువాఁడు.

ఇప్పటినుండి మహాశయులు చొక్కాను జోళ్లను ధరించుట మానివైచెను. ఒక యుత్తరీయమును మాత్రము కప్పుకొనును. భోజనము విషయమునమాత్ర మాత డెట్టి నియమములను పెట్టుకొనలేదు. ఏలయన శ్రీగురుదేవుఁడు "నీకేమి భగవంతుఁ డొసఁగునో, దానిపై జీవించియుండుము. నీకు వేరు నియమము లేమియు వలదు" అని చెప్పి

* గిరీశచంద్రఘోషు ప్రసిద్ధబంగాళీ నటకుఁడు. శ్రీరామకృష్ణుని ప్రియభక్తుఁడు.

యుండెను. సాధారణముగ నాతఁడు దినాంతమున కొలదిమాత్రము భుజించును అయినను జిహ్వాచాపల్యము నాపుట కుప్పను తీపిని ముట్టుట మానివైచెను.

నాగమహాశయుఁడు తనగృహములో కొంతభాగము కీర్తివాసుఁ డను నాతనికి బాడుగకిచ్చెను. ఆతఁడు బియ్యపు వర్తకముఁ జేయుచుఁ గుటుంబముతో నందుండువాఁడు. ఆ హేతువున అప్పుడప్పు డిల్లంతయు తవుడుతో నిండియుండును. మహాశయు లొకసారి తానిక నాతవుడునే భుజించి యుండవలయు ననుకొనెను. "ఈదేహము నిల్పుట కదియేచాలును. రుచికరములగు పదార్థము లెందులకు" అని నిశ్చయించుకొని యాతవుడును నీటిలోఁకలిపి రెండుదినములు దానినే భుజించియుండెను. ఇది కీర్తివాసునకుఁ దెలియనయ్యెను. తోడనే యాతఁడా తవుడునంతయు నమ్మివైచి యంతకు తరవాత యెన్నఁడు నింటియందు పోగువడకుండునట్లు చూచుచుండెను.

కీర్తివాసునకు, నాగమహాశయుని పావనజీవితము ఆతని యందమితగౌరవమును కలిగించెను. అందుచే నతిథిసత్కారమున కేమైన లోటువచ్చిన నాతనికి సాయపడువాఁడు. మహాశయుల గృహము రాజబాటకు ప్రక్కనేయుండుటచే నెందరో బిచ్చగాండ్రాతని ఇంటికి వచ్చుచుందురు. వారిలో నెవ్వరినికూడ రిక్తహస్తునిగ పంపుట లేదు. ఒకదినమున నొక వృద్ధవైష్ణవుఁడు భిక్షార్థియై వచ్చెను. మహాశయుల వద్ద నొకరికి సరిపడు అన్నముతప్ప నేమియు లేదు. కీర్తివాసుఁ డింటి వద్దలేఁడు. అంత నాతఁడతి నమ్రతతో నాతనిదరికేగి "యయ్యా నావద్ద కొలది బియ్యముమాత్ర మున్నవి. స్వీకరింతురా" యని యడిగెను. ఆవృద్ధుఁడాతని నమ్రత కాశ్చర్యపడుచు సంతసమున నాబియ్యముఁ గొంపోయెను.

# మంత్రోపదేశము - దక్షిణేశ్వర యాత్ర

నాగమహాశయులెన్నడును ఫలహారముచేసి యెరుగడు. భగవంతునికి నైవేద్యము చేయని భక్ష్యముల నాతడు తీసికొనడు. తాను రుచికరములగు పదార్థములనెన్నడును ముట్టక పోయినను అతిథుల నట్టి పదార్థములచేతనే తృప్తిపరచును.

మహాశయులు ప్రాపంచిక విషయములగూర్చి మాటలాడరు. ఒరులెవ్వరైన నట్టి సంభాషణ యందున్నయెడల నాతడు అతి చాకచక్యముగ "జయశ్రీరామకృష్ణ" యనుచు "ఈవ్యర్థసంభాషణ వలన నేమిలాభము. దయయుంచి భగవన్నామము నుచ్చరించుచు కాలమును గడపుడు. జగన్మాతను నమస్కరింపుడు" అనును. ఏదైనకారణమున తనకొరులపై కోపముగాని యసూయగాని జనించినయెడల తనప్రక్కనేయున్న దానితో తనదేహమును మర్దించుకొనును. పరుల దుర్గుణముల నాతడు గణింపడు. ఒకమారు మాట సందర్భమున నొకని దుర్గుణములఁ జేర్కొనెను. మరుక్షణముననే ప్రక్కనున్న యొక రాతితో తలను మోదుకొన నారంభించెను. రక్తము బాగుగా కారి యా గాయము నెలరోజుల వరకు మానలేదు. కాని యాతడు సంతసమున "తగిన శాస్తియైనది, మంచిపనియైనది. ఈదుష్టునకుఁ దగిన బహుమానము లభించిన" దనెను.

తన మనోవికారముల నణచుటకై యాతడు తరచు దీర్ఘోపవాసములుండును. ఒక్కొకసారి యైదారు దినముల వరకు జలమును కూడ ముట్టక ఉపవాసముండును.

అట్టి యొకానొకసందర్భమున సురేశు డాతనియింటికి పోయి యుండెను. ఆసమయమున నేమియభిప్రాయము గలిగెనో గాని సురేశునిఁ జూడగనే వండుచున్న కుండను శకలములగావించి యేడ్చుచు

"సురేశా! నాకింకను క్రూరత్వము నశించినది కా" దనెను. ఆదినమున భోజనముఁ జేయక ఒక దమ్మిడి యటుకులను దిని యుండెను.

నాగమహాశయునకు తలనొప్పి దీర్ఘవ్యాధి యగుటచే స్నానము విడువవలసివచ్చెను. కడపటి ఇరువది సంవత్సరములు అతను స్నానము చేయనేలేదు. అందుచే ఆతని శరీరము యెండి కరకుగా నుండెను. దానిపై ఘోరమగు తపస్సు. ఇవి యన్నియుఁగూడి యాతని శరీరము యొక్క ప్రతిభాగమును ఆతని నమ్రతను జాటుచుండెను. వేయేల నమ్రతయే యిట్టి రూపముఁ గైకొన్న యట్లుండును. "నాగమహాశయులు అహంభావము యొక్క శిరమును చితుకఁగొట్టి చితుకఁగొట్టి దానిని పగులఁగొట్టె" నని గిరీశ బాబనువాడు. మహాశయులు వీధివెంబడిఁ బోవునప్పుడు కూడ ఇతరులను అతిక్రమించి ముందుకుపోవువాఁడు కాఁడు. సాధారణ బాటసారులకు కూడ త్రోవయిచ్చి తొలఁగును. పరుల నీడనైన త్రొక్క సాహసింపఁడు. ఇతరులు కూర్చొనియున్న ప్రక్కపై నాతఁడు కూర్చొనఁడు. ఎందువలన యన నాతఁడు సర్వ వస్తుసముదాయమునను భగవంతునిఁ జూచును. తాను భగవత్సేవకుఁడు. అట్టిచోఁ దానెట్లు ఈశ్వరుఁడు సేయు సపర్యల నంగీకరింపఁగలఁడు? కాని ఈసేవకుఁడు ఆసర్వవ్యాపి యగు పరమేశ్వరుడే రూపమున వచ్చినను పరిచర్యసేయుటకు తయారుగ నుండును. ఒరులు తయారు చేసి యిచ్చిన పొగాకు చిలుముల నాతఁడు త్రాగఁడు; కాని తానందరకుఁ దయారుసేయును. స్నేహితుఁడింటికి వచ్చినప్పుడు అతనికి చిలుములు తయారుచేసి యిచ్చును. ఆమిత్రుఁడు వెళ్లునపుడు గూడ నాపి యొకరెండు చిలుములను కాల్చుమని కోరును. "నే నల్పుఁడను. హీనులకంటె హీనుఁడను. నే నెట్టిగొప్ప కార్యమును చేయఁజాలిన వాఁడను గాను. మీకందరకిట్లు చిలుములను తయారుచేసియైన మీ కృపకుపాత్రుఁడనై నా జన్మమును సార్థకముఁ గావించుకొందు"నను.

# మంత్రోపదేశము - దక్షిణేశ్వర యాత్ర

నాగమహాశయులు, *రాగమార్గసాధకుఁడైనను, వైధీభక్తి యన నిష్టపడువాఁడు. తాను కష్టతరములగు సాధనలఁ జేయుటయే గాక నితరులనుకూడ అటుల నడచుకొనుమనును. ఈవిషయమై సురేశునితో నొకనాఁడు వాదము జరిగెను. సురేశుఁడు క్వెట్టాకు పోవలసివచ్చెను. క్వెట్టాప్రయాణమునకు ముందు మహాశయులు సురేశుని గురూపదేశమందు మరి ప్రార్థించెను. కాని సురేశునికి మంత్రములందు నమ్మకము లేకపోవుటచే నాతనితో వాదించి ఎట్టకేలకు నాతని ప్రార్థనపై శ్రీరామకృష్ణు లేట్లుచెప్పిన అట్లు చేతుననెను. మరునాడిర్వురు మిత్రులును దక్షిణేశ్వరమున కేగిరి. కూర్చొని కొంచెము విశ్రమితపడిన తరువాత నాగమహాశయు లీసంగతి దెచ్చెను. "అవును నీవనినది నిజము. ఉపదేశానంతరము ధ్యానాదుల నుపక్రమించుట మంచిది. సురేశా! నీవెందుల కంగీకరింపకూడ" దని శ్రీరామకృష్ణు లనెను. సురేశుఁ "దయ్యా! నాకు మంత్రములందు నమ్మికలేద" నెను. అంత శ్రీరామకృష్ణులు నాగమహాశయులవైపుదిరిగి "ఇప్పుడవసరము లేదు. కొంతకాలమున కదియే సిద్ధించు" ననెను.

సురేశుఁడు క్వెట్టాకుఁ బోయిన కొంతకాలమునకు గురూపదేశమందభిలాష జనించెను. కలకత్తాకువచ్చి శ్రీరామకృష్ణులవద్ద ఉపదేశమును పొంద నిశ్చయించుకొనెను. కాని యాతఁ డచ్చటికి వచ్చునరికి దక్షిణేశ్వర జ్యోతి చలించుచుండెను. తాను నాగమహాశయుని వాక్యముల సరకుగొననందులకు విచారించెను— శ్రీరామకృష్ణులు దివంగతులైరి. సురేశు డెంతయో విచారించి తన యదృష్టమును నిందిం

---

* రాగభక్తియందు భక్తుఁడు ఎల్లప్పుడు తనఇష్టదైవముయొక్క సాన్నిధ్యముననే యుండును. కావుననే వైధీభక్తియందలి పూజావిధానములను వీరు చేయరు.

చుకొనెను. ప్రతిరాత్రియు గంగాతీరముపై తన ఈతీరనికష్టమునకు దుఃఖించుచు గడెపుచుండెను. ఒకసారి శపథముపట్టి యా యొడ్డుననే పరుండెను. ప్రాతఃకాలమున నుదయాత్పూర్వమే యాశ్చర్యజనకముగ శ్రీరామకృష్ణులు గంగానదీగర్భమునుండి తనవైపునకు వచ్చుచుండుట గాంచెను. ఆవ్యక్తి సమీపించి యాతనిచెవిలో నొకమంత్రము నుపదేశించెను. సురేంద్రుఁడాతనిపాదములకు మ్రొక్కి పాదధూళి స్వీకరింపఁ గోరెను. కాని యాయద్భుతవ్యక్తి యంతలో అదృశ్యమాయెను.

మహాశయులు శ్రీరామకృష్ణుని ప్రథమమున చూచి ఇప్పటికి నాలుగు సంవత్సరములయ్యెను. శ్రీరామకృష్ణుఁడు తన యవతారమును చాలించు కాలము సమీపించుచుండెను. దక్షిణేశ్వరలక్ష్మి యస్తంగతమయ్యెను. దినాంతమున సూర్యుఁడు తన బంగరుకాంతి నింకను వెదజల్లుచుండినను రానున్న యంధకారమప్పుడే భక్తజనచిత్తములు నింపివేసెను. శ్రీరామకృష్ణుఁడు కలకత్తాకుత్తరమున నున్న "కాశీపురము" లో కాత్యాయనీరాణి యల్లుడగు, గోపాలబాబు తోటయింటియందు వ్యాధిగ్రస్తుఁడైయుండెను. జగన్మాత తన ప్రియపుత్రుని దనలో నైక్యము గావించుకొని మానవదృష్టిపథమునకు దూరము సేయఁబోవుచుండెనని మహాశయులు తెలిసికొనిరి ఈసమయమున గురుసందర్శనమునకై యాతఁడు తరచు పోలేక యుండెను. "ఆయన బాధను నేరుగ చూచుటనుగూర్చి నేనేమని చెప్పగలను. ఆబాధను తలపోయుటకే నాహృదయము శకలమైపోవుచుండెను. ఆయన తనకు దానే యీబాధ తెచ్చిపెట్టుకొనియుండ నేనద్దానిని నివారింపలేక యుండి ఆయన కడకు పోకూడదని నిశ్చయించుకొంటిని. ఎప్పుడో తప్ప తరచు అచ్చటికి పోలేకపోతిని" యని నాగమహాశయులు చెప్పినారు. శ్రీరామకృష్ణుని దేహ మగ్నివలె మండుచుండెను. ఒకనాడు మహా

శయులు ప్రక్కనుండుట జూచి "మహాశయా! ఇటురమ్ము. ఇటురమ్ము. నా ప్రక్కను గూర్చొనుము. నీ శీతలశరీరస్పర్శము వలన నా బాధ యుపశమించు" నని చాలసేపటివర కాతని యొడిలో గూర్చుండెను.

సురేశుడు క్వట్టానుండి మరలి శ్రీరామకృష్ణుల జూడ వచ్చినప్పుడు "ఆ వైద్యుడేడీ? ఆతడు మందునిచ్చునని యెఱుగుదును. ఆతని నొకసారి పిలిపింపుము" అనెను. అంత సురేశుడీ సంగతి నాగమహాశయుని కెఱుకపరచెను. మహాశయుడు లజ్జాబద్ధుడై 'కాశీపురితోట' కు బోయెను. శ్రీరామకృష్ణు లీతనిం జూచి "వచ్చితివా? మంచిది. భిషగ్వరులు, ఆయుర్వేదభూషణులు, రోగమును కుదుర్పలేక వదలుకొనిరి. నీవేమైన మంత్రమువేసి ఈరోగమును మాన్పగలవా? నీవు కుదుర్పగలవేమో చూడుము" మనెను. మహాశయులు తలవంచి కొంచెమాలోచించి, తన దృఢసంకల్పశక్తిచే నారోగమును తనమేనికి దీసికొన నిశ్చయించుకొనెను. అంత ఉద్రేకముతో "ఆ తెలిసికొంటిని. నీకృపామహిమచే సర్వమును తెలిసికొంటిని. ఈక్షణముననే ఈవ్యాధి కుదరగల" దని కేకవేయుచు శ్రీరామకృష్ణుని సమీపించుచు వచ్చెను. గురువు శిష్యుని మనోనిశ్చయము నెఱుగును. ఆతని యభిప్రాయమును తెలిసికొని శ్రీరామకృష్ణుడాతని నావలకి నెట్టివేసి "అది నీకు సాధ్యము. నీవు కుదుర్పగల" వనెను. గురువొక దురవగాహ సమస్య. శిష్యుడును అట్టి సమస్యయే.

శ్రీరామకృష్ణులు దేహమును చాలించుటకు అయిదారుదినములకు ముందు మహాశయులు ఆయనను చూడబోయెను. గదిలో నడుగుపెట్టుసమయమున శ్రీరామకృష్ణులు శిష్యులతో నిట్లనుచుండెను. "ఉసిరికకాయ ఎక్కడనైన దొరకునా? నాకన్నిటియందును అరుచి

యెక్కువయైనది. ఒకయుసిరికకాయ దినినచో యాయరుచి తగ్గునను కొనెదను." అచ్చటనున్న శిష్యులలో నొకరు "అయ్యా! యిది యుసిరిక కాయల కాలముకాదు" అనెను. నాగమహాశయులు "'ఉసిరిక'యనుమాట గురుముఖమునుండి వెలువడిన దనిన అది ఎచ్చటనైన దొరకక తీరవలెను. ఎందువలన యన ఆయన ఏవస్తువు కోరునో యది తప్పక అతని కడకు వచ్చితీరును", అని యాలోచించెను. ఒకసారి శ్రీరామకృష్ణు లద్భుతానందునితో నారింజపండు తినవలయునని యున్నదనెను. ఆసంగతి ఏమియు తెలియకపోయినను ఆదినముననే నాగమహాశయులు నారింజపండ్లను తీసుకొని వచ్చెను. అప్పుడాయన ఎంతయో ప్రీతిపూర్వకముగ నొకపండును తీసికొనెను. ఈ సంగతి జ్ఞాపకము తెచ్చుకొని మహాశయు లెవరితోడను చెప్పకయే ఉసిరిక కాయలను వెదకుచుపోయెను. రెండుదినములు గతించెను. కాని మహాశయులు మరలి రాలేదు. ఈరెండు దినములును ఉసిరికకాయలకై తోటవెంబడి తోటగా దిరుగుచుండెను. మూడవదినమున నుసిరిక కాయలతో శ్రీరామకృష్ణుల యెదుట నాతడు ప్రత్యక్షమయ్యెను. గురుదేవుని యానందమునకు మేరలేదు. బాలునివలె సంతోషపారవశ్యతఁ జెంది "ఆహా ఇట్టి కాయలీ యకాలమున నెట్లు తేగల్గితి"వని రామకృష్ణానందుని పిలిచి మహాశయులకు వంట సిద్ధము చేయుమనెను. మహాశయులు గురుదేవుని ప్రక్కగూర్చొని విసరుచుండెను. వంట సిద్ధమయ్యెను. గాని మహాశయులు భోజనమునకు లేవడాయెను. శ్రీరామకృష్ణుని మాటపై లేచెను భోజనము ముందు గూర్చుండెను గాని భోజనమును ముట్టడు—"నేడేకాదశి—ఉపవాసదినము—అయినను శ్రీరామకృష్ణులు తనహస్తముతో ప్రసాదమిడిన స్వీకరింతును" అని మనసున ననుకొనెను. కాని వెల్లడిచేయలేదు. నాగమహాశయు లెంత

# మంత్రోపదేశము - దక్షిణేశ్వరయాత్ర

నేపటికి భోజనము ముట్టకపోవుటచే శ్రీరామకృష్ణుల కీవిషయము నెఱింగించిరి. ఆయన ఆపదార్థములను తనవద్దకు గొనిరమ్మనిరి. రామకృష్ణానందుడట్లే వాని నాతని ముందిడెను. శ్రీరామకృష్ణు లందొక కొంతి నాలుకతో తీసికొని "ఇప్పు డాతని కిందు, స్వీకరించు" ననెను. రామకృష్ణానందుడా పదార్థముల నట్లే యాతనికిడెను. అంత మహాశయులు "ప్రసాదము మహాప్రసాదమని" యాపదార్థముల ముందు సాష్టాంగపడి యాకుతో సహితముగ భుజించెను. ఎన్నడైన నాతనికి ప్రసాద మిడుచో నందు లేశమైన విసర్జింపడు. మహాశయులయం దాదినమున దివ్యభావము కానుపించె నని రామకృష్ణానందు డనెను. ఇది జరిగిన తరువాత నాతని కెన్నడు నాకులలో ప్రసాద మిడువారు కారు. ఒకతరి ఎన్నడైన నాకులో వడ్డించినను, భోజనము ముగియు వరకు వేచియుండి యాకును లాగుకొనుటకు సిద్ధముగ నుండువారు. ఏదైన పండ్లిచ్చునప్పు డందలి గింజలను టెంక మున్నగునవి తీసి యిచ్చువారు.

౧౮౮౬ వ సం॥ ఆగష్టు ౧౬ తేదీని శ్రీరామకృష్ణులు మహాసమాధినొందిరి. ఈ సంగతి తెలిసి నాగమహాశయులు స్మశానవాటికకుఁ బోయి యాదినమంతయు నిరాహారుడై యుండెను. గురుదేవుని మహాసమాధియనంతరము శిష్యు లందరును వివేకానందస్వామిని చుట్టుముట్టిరి. వారి కాతడు మార్గదర్శకుఁడై మిత్రునివలె నుండెను. ఆతనికి నాగమహాశయుఁ లాహారమును విసర్జించి, ముసుగిడుకొని తనయింట నొకమూల పరుండియున్నాడని తెలిసెను. అంత అఖండానంద తుర్యానంద స్వాములతో గూడ నాతఁడు మహాశయుల గృహమున కేగెను. ఎంతయో బ్రతిమాలిన తరువాత మహాశయులు మంచమునుండి లేచెను. వివేకానందు డంత "నీఇంటి కాతిథ్యమునకు వచ్చితి"

మనెను. మరుక్షణముననే మహాశయులు సరకులకొఱకు బజారునకు పోయెను. ఇంతలో ఈ మువ్వురతిథులును స్నానమాచరించి యొక మంచముపై గూర్చొని శ్రీరామకృష్ణులగూర్చి ప్రసంగించుకొనుచుం డిరి. వంటకము సిద్ధమైన తరువాత ముగ్గురికిని వడ్డించెను. వివేకానం దుని కోరికపై వేరొక యాకులోకూడ వడ్డించెను. పిమ్మట మువ్వు రతిథులును మహాశయుల భుజింపుమని కోరిరి. కాని యాత డందుల కంగీకరింపలేదు. అంత వివేకానందుడు "మీరు తినుడు. అనంతర మాతడు భుజించు" ననెను. భోజనానంతరమున మరల ప్రార్థించిరి. అందులకు మహాశయు "అయ్యో! భగవంతుని యనుగ్రహము సంపా దింపజాలని ఈదేహమున కెట్లాహార మిడగల" ననెను. "అయ్యా! మీరు భుజింపనిచో మిమ్ము విడువజాల"మని వివేకానందు డనెను. ఎట్టకేల కెంతయో బలవంతముపై మహాశయులచే భుజింపించిరి.

శ్రీరామకృష్ణు లవతారమును చాలించినతరువాత నాయన శిష్యులును, బాగ్‌బజారు వాసుడు నగు శ్రీయుత బలరామబోసు నాగమహాశయులను పూరియం దుండుమని కోరెను. "మెస్సర్సు పాలు లు" నవద్వీపమునం దుండుమని బలవంతపెట్టిరి. ఇర్వురును ఖర్చులను భరింతుమనిరి. కాని మహాశయులు "నన్ను గురుదేవు లింటి వద్దనే యుండు నట్లాజ్ఞాపించిరి. ఆయనయాజ్ఞను జవదాటుటకు నా కెట్టి హక్కును లే"దని వారి కోరికలను నిరాకరించి గుర్వాజ్ఞాప్రకారము తన యూరియందు తనఇంటిదగ్గరనే యుండిపోయెను.

భాగ్యకులవాసులగు "కుండూ" కుటుంబమువారు ఆతనిని నెలకు యేబదిరూప్యముల వేతనముపై తమగృహవైద్యునిగ నుండుమనిరి. కాని మహాశయు లొప్పుకొనలేదు.

## జన్మస్థాన నివాసము

నాగమహాశయు లిప్పుడు వృద్ధుడగు తండ్రికి బరిచర్య సేయుచు నింటియందే యుండిపోయెను. దీనదయాళు వార్ధకతచే బల హీనుడై యుండెను. మహాశయులాతని పరిచర్య యందప్రమత్తుడై యాతని ఇష్టప్రకారము నడచుకొనుచు ప్రేమతో పుత్రవిధి నెఱవేర్చు చుండెను.

ఒకసారి దీనదయాళు విచారముతో "అందరును జగన్మాతను సేవించుచున్నారు. మన యార్థిక పరిస్థితి బాగుండుచో మనముగూడ అట్లు చేయవచ్చును. కాని మనమట్టి యదృష్టమును నోచుకొనలేదు. దుర్గాచరణుడు ధనము నార్జించుటను వదలివేసెను," అనెను. మహాశయు లిది విని యావత్సరమాది ప్రతిసంవత్సరమును దుర్గాపూజ, కాళీపూజ, జగద్ధాత్రిపూజ, మొదలగువానిని యొనర్చి తండ్రికోరికను తీర్చి సంతోషపెట్టుచుండెను. తండ్రియెదుట నెప్పుడును భాగవతము మొదలగు పురాణములను పఠించుచు ప్రాపంచిక విషయములను దలపెట్టనీయక చూచుచుండెను. పుత్రుని ప్రయత్నములవలన తండ్రి మనస్సు మార్పుచెందెను. మహాశయులు ప్రతిసంవత్సరమును, శారదోత్సవమునకు వలయు సంభారములకై కలకత్తాకు బోవును. అట్టి యొకానొక తరుణమున సురేశునితో "నా తండ్రి పూర్తిగ మార్పు జెందెను. ప్రాపంచిక విషయములపై తలంపులు బోనీయక సర్వదా భగవన్నామమునే జపించుచున్నాడ"ని చెప్పెను.

తూర్పుబంగాళము తాంత్రికసాధనలకుఁ బ్రసిద్ధికెక్కినది. అచ్చట భక్తికంటె యద్భుతకార్యప్రదర్శనములకే విలువ యెక్కువ. వివేకానందస్వామి యొకసారి "తూర్పు బంగాళమున, వైష్ణవ, తాం

త్రిక సాధనల కెక్కుడు ప్రాముఖ్యతకలదు. వామాచార సాధనలకు ప్రసిద్ధికెక్కిన యిట్టి వేరొక రాజధానిని నే నెరుగ" ననెను. శ్రీరామకృష్ణులొకసారి నాగమహాశయుని "మీరాజధానియందు గొప్ప సాధువులుగలరా" యని ప్రశ్నింప నాతఁడు లేరని ప్రత్యుత్తర మిచ్చెను. అతనికి గంగాతీరమున నే దక్క వేరొకచోట నిజమైన భక్తులు జన్మింపరని నమ్మిక. గొప్పవిద్వాంసులును, తార్కికులును ఉండిన ఉండవచ్చును.

మహాశయులు తన యింటియందు నివాసమేర్పరచుకొనుటకు పూర్వము, తూర్పుబంగాళములో గీర్తియుతులైన నతోబార్ విజయకృష్ణ గోస్వామి పూర్ణభక్తితత్త్వము నుపదేశించుచుండెను. విజయుడు శ్రీరామకృష్ణుని శిష్యుడని మహాశయులెఱుఁగుదురు. తన జన్మస్థానమునకు వచ్చిన తరువాత నతఁడొకసారి పనిమీద ఢాకాకుఁ బోవలసి వచ్చెను. ఆ తరుణమున విజయుని దర్శనమయ్యెను. విజయుఁడు మహాశయుల నెరుగడు. కాని తనదివ్యదృష్టిచే తనదరికి వచ్చియున్న యా యున్మత్తుఁడొక మహాపురుషుఁడై యుండవలెనని తెలిసికొనెను. సంభాషణావసరమున మహాశయుడు శ్రీ రామకృష్ణుని శిష్యుఁడని తెలిసినంత విజయుని సంతసమునకు మేర లేకుండెను. అతనిని సమీపబంధువుని వలె నాలింగనమొనర్చుకొనెను. మహాశయులకుఁ గూడ విజయుని యందు భక్తిగౌరవము లుదయించెను. కాని యాతఁడు శ్రీరామకృష్ణునిచూచి యుండియు ఇంకను ఇతరసాధువుల జూడ నేల యాతురపడుచుండెనో యని యాశ్చర్యపడెను. విజయునివంటి వారలే అట్లు మోసపోవుచున్న నిక తదితరులగతి వేరుగఁ జెప్పవలయునా యని యనుకొనెను. గిరీశబాబొకతరి విజయుడు శ్రీరామకృష్ణుని సమక్షమమున నిమీలిత నేత్రుడై ధ్యానమొనర్చుచుండుటనుజూచి "కం

ట్లారఁజూచి యానందింపవలసిన మహాత్ముని ఎదుట గూర్చొని కండ్లు మూసికొను నవివేకి యెవఁడు” అని చెప్పెను. మహాశయులీ వాక్యమును విని గిరీశబాబు గొప్పవిద్యానిధియని పొగడుచు నాతనికి సాష్టాంగము నమస్కరించెను.

తూర్పు బంగాళమునఁ బారడి యను బ్రహ్మచారి కెక్కుడు పలుకుబడియుండెను. ఈయన శిష్యుఁడగు బ్రహ్మానంద భారతుని కోరికపై మహాశయులొకమారు బారడిని చూచుటకుఁ బోయెను. ఇంతకుఁ బూర్వము, బ్రహ్మానందుఁడు తారాకాంత గంగోపాధ్యాయుఁడని పిలువఁబడుచుండెను. తారాకాంతుఁడు న్యాయవాదివృత్తివలన చాల ధనము గడించెను. మొదటినుండియు ఈతనికి భగవత్ప్రార్థన యనినను సాధుజనసంసేవనమన్నను అమితానందము. ఆ కారణమున కొంతకాలమునకు తన వృత్తినుండి విరమించుకొని భగవద్ధ్యానమందే గడుపసాగెను. ఈతఁడు తరచుగ నాగమహాశయుల దర్శించుచు నాతనితో నొక్కొక్కప్పుడు నాలుగైదు దినములుండును. కొంతకాలమైన తరువాత ఈతఁడు బ్రహ్మచారివద్దకుఁ బోవుచు నాతని శిష్యునివలె మెలఁగ నారంభించెను. ఒకసారి తాను బ్రహ్మచారికి పూర్వజన్మమున గురువని చెప్పెను. ఒకనాఁడు తారాకాంతుఁడు మహాశయులఁ జేరి, తనకుఁ బూర్వ జన్మస్థితి జ్ఞప్తియున్నదనియుఁ, దానిప్పుడు చంద్ర, సూర్య, బ్రహ్మాదిలోకముల కేగగలననియు, జాతిమతభేదములును, ఆచారములు, ధర్మాధర్మములు, అన్నియు నసత్యములనియు, జ్ఞానమొక్కటే సత్యమనియు ననెను. నాగమహాశయు లీమార్పును చూచి “గురు కటాక్షము లేనియెడల నెంత గొప్ప సాధకుఁడైనను తప్పుదారిని పడి పోవును” అనెను.

# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

తారాకాంతుని బలవంతముమీద మహాశయులు బారడిని చూచుటకు బయలుదేరెను. సాధు సందర్శనమున కేగునప్పుడు రిక్త హస్తముతో పోగూడదని కొన్ని పండ్లను తీసికొనివెళ్లెను. బ్రహ్మచారి యందు దేనిని స్పృశింపక ప్రక్కనున్న యాబోతున కర్పించెను. మహాశయుని దీనదృష్టులను, కృశాంగమును, మలినవేషమును జూచి యధిక్షేపణాపూర్వకముగ నవ్వమొదలిడెను. కాని మహాశయులు తల వంచుకొని లెక్క సేయకుండెను. అతని శాంతభావమును చూచి సహింప నేరక బ్రహ్మచారి శ్రీరామకృష్ణునియందు దోషమారోపించి దూషింప సాగెను. నాగమహాశయులు దీనిని సహింపలేకపోయెను. నేత్రములు క్రోధపూరితములయ్యెను. శిరము పైకెత్తి చూడగనే కృష్ణపింగళవర్ణమున భీషణాకృతితో భైరవమూర్తి యొకడు బ్రహ్మచారి నణచి వేయుటకై యాతని యనుజ్ఞను కోరుచు నెదుట నుండుటను చూచెను. కాని యాక్షణముననే కోపము నణచుకొని తన తలను నేలపై గొట్టుకొనుచు "తండ్రీ! నీ యాజ్ఞ నుల్లంఘించి యన్యసాధు దర్శనాభిలాషి నగుటవలన తగిన శాస్తియైనదని" యచ్చోటు వాసి "తండ్రీ! రామకృష్ణా!" యనుచు పరుగెత్తిపోయెను. గృహమున కేతెంచిన పిదప నిక ముందెట్టి సాధువులను దర్శింపఁ గూడదనుకొనెను. ఇతరులెవరైన నొక సాధువును గూర్చి చెప్పునప్పుడు "మనసా! అట్టి అభిలాషలకు చిక్కకుము! ఒరుల గృహముల నెన్నడును మెట్టకు" మని తన్నుదా నాజ్ఞాపించుకొనును.

బ్రహ్మచారి శిష్యుడింకొకడు నాగమహాశయులవద్ద కప్పుడప్పుడు వచ్చుచుండెను. అతడీ పై సంగతి జరిగిన తరువాత నొక దినమున నాగమహాశయునితో "అయ్యా! నిన్ను మా గురువుగారొక వత్సరములో రక్తము గ్రక్కుకొని చత్తువని శపించి"రనెను. ఇది విని

మహాశయులు కడుపు చెక్కలగునట్లు నవ్వెను. ఇది జరిగి పూర్తిగనొక సంవత్సరము గడచెను, గాని శాపప్రభావమేమియు గన్పట్టలేదు. అందువలన నా శిష్యుడు గురువునందలి విశ్వాసము నశింప మహాశయుల యాంతరంగిక శిష్యుడయ్యెను. అప్పటినుండి భక్తిమార్గావలంబియై జీవితమందు గొప్ప మార్పుగలిగి ప్రవర్తించెను.

ప్రాపంచిక విషయములకై నాగమహాశయు లెన్నడును కలత పడియుండలేదు. కాని గురునిందయన నాతడు రౌద్రమూర్తియే. నారాయణగంజి నివాసియగు నొక సంపన్నుడు ఒకపరి శ్రీరామకృష్ణుని గూర్చి యసత్యకథనములఁ జెప్పి నిందింపసాగెను. అంత మహాశయు లాయన నట్టి సంభాషణను మానుమని వినయముతో ప్రార్థించెను. ఈతడు ప్రార్థించుకొలదియు నా సంపన్నుడింకను వచ్చినట్లు దూషింప నారంభించెను. మహాశయుడు "గురుదేవునిపై ఇట్టి కల్ల నిందలను మోపకుము" అని ఎంతయో చెప్పెను. కాని యాతడు మానలేదు. మహాశయులు సహింపలేక "నాయింటినుండి యావలికిఁ బొమ్ము. లేకపోయిన తగిన శాస్తి ననుభవింతు"వనెను. దీనిని కూడ నాతడు లెక్కసేయలేదు. మహాశయుని శాంతమంతయు నశించెను. రక్తారుణితలోచనుడై తనువు కంపమొంద, నాతని చెప్పుదెబ్బలతో సన్మానించుచు "నీచుడా! నా ఇంటినుండి తత్క్షణమే వెడలిపొమ్ము. నా గృహమునందే నా గురుదేవునిపై నింద నారోపింప సాహసించెదవా" అనెను. ఆతడు దియోబాగునందు పలుకుబడి కలవాడు. అట్లు దెబ్బలు తిని పోవుచు అతడు "నీవెట్టి సాధువో చూచెదగాక! దీనికి తగిన ప్రతిఫలము ననుభవింపక తప్పదు" అనెను. నాగమహాశయులా బెదరింపులను లెక్కసేయక "తండ్రీ! నిన్ను దూషించువారగల నా గృహమున కెందులకుఁ బంపెద"వని శ్రీరామకృష్ణునితో మొరబెట్టుకొనెను.

తరువాత కొంతసేపటిలోనే శాంతించెను. కొలది దినముల కావల నాసంపన్నుఁడును మరల నేతెంచి క్షమింపుమని యాతని వేడుకొనెను. నాగమహాశయులాతని లేవనెత్తి ప్రేమపూర్వకముగఁ నవ్వుచుంచి సంతోషపరచెను. తరువాత నాతడింటికి మరలిపోవునప్పుడు తాను కూడ కొంత దూరముపోయి దిగవిడచి వచ్చెను. సాధు పాదుకా ఘాతమువలన సంపన్నునకు మనసు మారి మంచివాఁడయ్యెను. గిరీశ బాబునకీ సంగతి తెలిసి నాగమహాశయులు కలకత్తాకుఁ బోయినప్పుడు "నీవు చెప్పినను తోడుగవుకదా! అతని కొట్టుటకు చెప్పు లెచ్చటి నుండి తెచ్చితి"వనెను. అందులకు మహాశయులు "ఆతని చెప్పులతోనే యాతని కొట్టితినని చెప్పి "జయ శ్రీ రామకృష్ణ జయ శ్రీరామకృష్ణ" యనుచు నాతనికి నమస్కరించెను. గిరీశబాబతనితో "నీవు త్రాచు పామువంటివాడవు సుమా!" యనెను.

ఒకానొక దినమున నాగమహాశయులు బేలూరు మఠమున కేగు చుండెను. మార్గమధ్యమున నావపై గంగానదిని దాటవలసివచ్చెను. ఆ నావలో పలు స్వభావములు గలవారుండిరి. నాగమహాశయులొక మూలఁ గూర్చుండెను. నావ కొంత దవ్వుసరికి బేలూరు మఠము దృగ్గోచరమయ్యెను. అంత మహాశయులు చేతుల జోడించి నమస్కరించెను. ఈతఁడు నమస్కరించుట జూచి యందొకఁడు ఆ మఠమందలి వారి యాచారవ్యవహారములను ఖండించుచు దూషింపసాగెను. మరియిద్దరు ముగ్గురాతనితో తాళము వేయ మొదలిడిరి. మహాశయుడు దీనిని సహింపలేక ఉద్రేకపూరితుఁడై "విషయాలోలురగు మీరేమెరు గుదురు? మీ కా మఠమునుగూర్చి యేమి తెలియును? ఛీ! అందలి సన్యాసులను దూషించిన మీ సిగ్గులేని నాల్కలను ఎవరేమి చెప్పగ లరు," యనెను. ఈతని భీషణవాక్యముల కా బాటసారులు భయ

పడి నావికునిచే ద్వరలో దరిజేర్పుమనిరి. నావ దరిజేరినంతనే ఆసాధుల దూషించినందులకు దత్తాత్రేయుడు శపించునేమో యని వారు పర్వెత్తసాగిరి. ఈ సంగతి వివేకానందుడెఱిగి "ఒక్కొక్క సమయమున నిట్లు బుసపెట్టవలసి యుండును" అనెను.

నాగమహాశయుల గృహమున కొకనాడొక సన్న్యాసివచ్చెను. ఆతని త్యాగము వస్త్రములయందును, వైరాగ్య మమాయకులగు గృహస్థులయెడలను మాత్రమే దీపించును. మరియు గంజాయి యన్న నతనికతి ప్రియము. గంజాయి త్రాగుటలో నాతనిని మించిన వాడింకొకడుండడు.

ఆతడు దిగంబరియై వచ్చుచు దూరమునుండియే మహాశయుని జూచి కొంచె మనుమానించి వస్త్రములను ధరించి మహాశయుని జూడ వచ్చెను. అనంతరము మహాశయులంజేరి అణిమాద్యష్టసిద్ధులను గూర్చి ప్రసంగింప మొదలిడెను. అంత మహాశయులు "ఈ భావములన్నియు నతి హేయములు. శ్రద్ధాభక్తిలాభమునకు శత్రువు"లనెను. సన్న్యాసి యామాటలను చెవినిబెట్టక "నేను మలము తిని యేడు దినములుండ గల"ననెను.

నాగ:—దానివలని గొప్పతనమేమి? కుక్కలు జీవితమంతయు మలమును తినియే గడపును.

సన్న్యా:—నేను దిగంబరినై జీవితమంతయు గడుపగలను.

నాగ:—పిచ్చివాడా! పసువులు పక్షులూ మొదలగు జంతుజాలమంతయు వస్త్రములు లేకయే తిరుగును. నీ గొప్పతనమేమి?

సన్న్యా:—నేను తరులతాదుల క్రిందనే జీవితము గడుపగలను.

నాగ:—ఇందు మాత్రమున్న ఘనతయేమి? జంతువు లెన్ని వృక్షాదులనే యాశ్రయించి బ్రతికియుంటలేదు?

సన్యాసి యిట్టి విధములగు సిద్ధులనెన్నో చెప్పెను. అంత మహాశయుని ప్రియభక్తుడగు నతోబాబు ఇక నాతనికి అవకాశ మీయక సన్యాసికి సంహారముద్రను చూపెను. సిద్ధుల విషయమై మహాశయులు "సిద్ధులను పొందుట యైదారు నియమముల కార్యము. ఐదు నియమములు ప్రయత్నించుచో ఎట్టి సిద్ధినైనం బొందివచ్చు"ననును.

ఇట్టి సన్యాసులు అనేకులు బంగాళమున గాన్పింతురు. అచ్చట వారికి గౌరవము హెచ్చు. నాగమహాశయుని దీనభావములను మలినవేషమును, విశేషముగా నాతడితరులవలె సాంసారికి కృత్యములను చేయుట మొదలగునవి చూచి మొట్టమొదట నాతని నెవరును మహాపురుషుడని తెలిసికొనజాలకుండురు. కాని యొక్క మారాతనితో మాటలాడిన "ఈ దీన హీనగృహమేధి మనుష్యరూపమున నున్న దేవతయే" యని తెలిసికొందురు.

ఒకపరి దీనబంధు ముఖోపాధ్యాయుడను నాతడు దయోబాగునకు వచ్చెను. దీనబంధు మంచి గాయకుడు. మహాశయుల నాతని "ప్రసాద పదావళిని" వినెను. అతనికి దానిని ఎన్నిమారులు వినినను తనివి లేకుండెను. అంత దీనబంధు "ఇట్టి మహాపురుషుని నా జీవితమున నింకొకని చూచియుండ"దనెను. ఇతిహాసములలో విదురుడు మొదలగు వారలగూర్చి వినినచో మహాశయులు వారికెంతమాత్రము తీసిపోడని తెలియగును. విదురుడే మరల ఈ మహాశయరూపమున యవతరించెనా యని యనుకొందుము.

శరచ్చంద్ర చక్రవర్తి (మహాశయుని శిష్యుడు—ఆయన జీవితమును మొదట వంగభాషలో రచించిన భక్తుడు) మామగారగు

# జన్మస్థాన నివాసము

శ్రీయుత మదనమోహన బారుదీ యను నాతడు, తనయల్లుడు (శరచ్చంద్రచక్రవర్తి) నాగమహాశయుని సంసర్గమువలన చదువుకొనుటమాని సంసార ధర్మములయెడ విరక్తిగలిగియుండెనని లోకులవల్ల వినెను. నిజమగుసంగతి యేదో తెలిసికొనవలెనని మదను డొకనాడు దియోబాగునకు బోయెను. నాగమహాశయుని చూడగనే యాతని యుద్వేగమంతయు దూరమయ్యెను. మహాశయుని ఆదరణచేతను ఆతని యమ్మ యొక్క వ్యవహారముచేతను, అతిథి సత్కారముచేతను సంప్రీతుడై తన అల్లుడు అట్టి మహాపురుషునివద్దకు వచ్చుచు పోవుచు నాతనితో పరిచయము కలిగియున్నచో అదృష్టవంతుఁడేయని అనుకొనెను.

"ప్రఫుల్ల కుసుమముల వెదకుచు తుమ్మెదలు తమంతతామే వచ్చును. దివ్యజ్ఞాన ప్రసారముచే వికసితమైన హృదయము తన తేజస్సును నలుప్రక్కలకుఁ బ్రసరింపజేయక మానదు. అప్పుడు నిజమగు భక్తులు, సత్యాన్వేషణా పరాయణులును, తమకు దామే యాతనిఁ జుట్టుముట్టుదు" రను శ్రీ గామకృష్ణుని మహావాక్యము మహాశయునియందు సార్థకమయ్యెను. ఇప్పుడు సత్యాన్వేషకులు, జ్ఞానసంపాదనోత్కంఠులు, వివిధ దేశములనుండి ఈతనిఁ జేరుచుండిరి. ఈతని కీర్తికాంత నల్దిక్కులకుఁ వ్యాపించెను. నాగమహాశయులు భార్యనుజూచి "శ్రీ రామకృష్ణుని తుదివాక్యము లీనాటి కనుభవసిద్ధములయ్యెను. ఇచ్చటికి వచ్చువారందరును ఈశ్వరాన్వేషకులన్న మాట సత్యము. ఇట్లని యాయన నాతో చెప్పిరి. అందువలన నందరిని జాగ్రతతోను భక్తిశ్రద్ధలతోను ఉపచరింపుము. నిన్ను జగదీశ్వరు డాశీర్వదించు" ననెను.

# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

నాగమహాశయుఁడు తన దర్శనాభిలాషులై తన ఇంటి కెవ్వరరుదెంచినను, స్వల్పాహారమైన గ్రహింపకుండ బోనిచ్చువాఁడుకాఁడు. దూరమునుండి వచ్చువారలకు శయ్యల నమర్చును. గృహములోని కొంతభాగమున నిట్టి యాగంతుకుల యుపచారమునకని ప్రత్యేకించి యుంచెను. అందు వారెన్నినాళ్లైన నుండవచ్చు. కుటుంబమందలి ప్రతివ్యక్తియు నతిథిసత్కారమున నమితానందముఁ జెందుదురు. దీనదయాళొకసారి "గృహస్థుని హస్తమునుండి అతిథి యాహారమును బలవంతముగ లాగుకొనినను యజమాని స్వర్గమున కేగునట. ఈ దరిద్రుని గృహమున కిందరతిథులేతెంచి భుజించుట నాపూర్వజన్మ పుణ్యమే" యనెను. అందులకు మహాశయులు "ఇది యంతయు భగవానుని విచిత్ర లీలానటన. ఆయనయే అనేక రూపములలో మనలను తరింపఁజేయుటకు వచ్చుచున్నా"డనెను. నిజముగ నాతఁడతిథులను భగవన్మూర్తులుగ దర్శించువాఁడు.

ఒకదినమున నాగమహాశయులు శూలనొప్పిచే బాధపడుచుండెను. బాధ దుర్భరముగా నుండెను. ఒక్కొక్కప్పుడు స్మృతి తప్పిపోవుచుండెను. అట్టి సమయమున నీతని కెరుకపరుపక యే పదుగురు భోజనమునకు వచ్చిరి. ఇంట పిడికెఁడు బియ్యమైనను లేదు. ఏమి చేయఁగలఁడు? ఆ యవస్థయందే, వేదన ననుభవించుచు, అంగడికి బోయెను. తనపనుల నొరుల మోయనీయఁడు గాన, బియ్యపు మూటను భుజముపై వైచుకొని వచ్చుచుండెను. బాధమిక్కుటము కాగా నతఁడు వచ్చుచువచ్చుచు క్రిందపడిపోయెను. కాని యతఁడు తనబాధకై ఇసుమంతయు విచారింపక "తండ్రీ! రామకృష్ణా! ఈనా కర్మమేమి? ఇల్లేల తెచ్చిపెట్టితివి? నారాయణస్వరూపులింటి కాతిథ్యమునకై యరుదెంచియున్నారే! వారిని సత్కరించుటకాలస్యమగు

చున్నది. ఈ దినము సాధు సంసేవనమునకీ యస్థిపంజర వేల యడ్డు తగులుచున్నది" అని అశ్రువులురాల ప్రార్థించెను తరువాత కొంత సేపటికి బాధ యుపశమిల్ల ఇంటికేతెంచి యా సాధుమూర్తులకు సాగిలపడి తన యాలస్యమునకు వన్నింపుడని వేడుకొనెను.

వర్షాకాలమున నొక దినమున వాన జోరున వర్షించుచుండ నిర్వురతిథులేతెంచిరి. ప్రచండమారుత మప్రతిహతముగ వీచుచుండెను. ఆ రాత్రివర్షము మింటికి మంటికి నేకధారయై వర్షించుచుండెను. నాగమహాశయులకు నాల్గుగదులు మాత్రమే కలవు. ఆనాల్గింటియందును మూడు జీర్ణములై వర్షాతపముల నాపలేకయుండెను. కప్పుయొక్క సహస్రరంధ్రములనుండి సహస్రధారలుగ వర్షము కురియుచుండెను. నాల్గవ గదిమాత్రము మంచి స్థితియందుండెను. అందు నాగమహాశయులు పరుండును. ఇప్పుడతిథులు భోజనములుగావించిరి. కాని యారేయి గడుపుటెట్లు? నాగమహాశయులు భార్యను బిలచి "చూడుము. ఇట్టిసమయమున నతిథులేతెంచుట భగవంతుని యాశీర్వాదము. మనమెంతయు నదృష్టవంతులము. ఈ రాత్రికెట్లో వెగడిదదని గూర్చొని భగవన్నామము జపించుచు గడపుదమని" యయ్యతిథులనందు శయనింపజేసి, తామారాత్రి యంతయు వెగడి దరిని ధ్యాన నిమగ్నులై గడపిరి.

నాగమహాశయునకు మాసవేతనముగాని నియమిత వ్యయము గాని లేదు. ఉప్పుకొఠారుపై వచ్చులాభములు మాటిమాటికి మారుచుండెను. ఇంటికి లెక్కలేక యతిథులేతెంచుచుండిరి. అందువలన తరచు ఆహారపదార్థము లయిపోవుచుండెడివి. కాని ఎప్పుడే పదార్థములు కావలసినను తన్నెరిగియున్న నారాయణగంజి

షాహుకార్లవద్ద నప్పుగొని సొలుసరికి కలకత్తానుండి రంజితుహ్రా పంపు ధనముతో నాయప్పులను దీర్చువాడు.

పట్టణములలో నున్న భాగ్యవంతులు గూడ దుకాణదార్ల నుండి, మహాశయులు పొందునంత గౌరవమునుఁ బొందఁజాలకుండిరి. తక్కినవారందరు కొను వెలకే నాగమహాశయు లెక్కువ సరుకులను పొందువాడు. కాని యీ సంగతి తెలిసినప్పుడు వారికిచ్చునన్ని సరకులనే తనకుఁ గూడ నిమ్మని నిరోధించును. ఒక కొట్టుమీదనే ఆదుకాణదారడుగు వెలకే, కొనుట ఈతనికి స్వాభావికమై యుండెను. అయినను ఎన్నడును మోసపోలేదు. "ఎవడు సత్యమునే నమ్మి దానినే పరమావధిగఁ జూచునో యాతడు మోసపోక సర్వదా రక్షింపఁబడు చుండును. అతఁడే భగవత్కరుణా సముద్రమునం దోగులాడుచుండు" నని యతఁడు చెప్పుట వాడుక.

ఆతని సాధుస్వభావ మెల్లరెరిగినదే యగుటచే నాతని మోస పుచ్చ సాహసింపలేకపోవువారు. అదియుఁగాక నాతనియందు, పరులగౌరవమును పొందనగు శక్తి మూర్తీభవించియుండెను. ఒక సారి నాగమహాశయులొక క్రొత్త దుకాణమువద్దకుఁ బోవుట తటస్థించెను. మొదటిదినములలో నెక్కువధరలు చెప్పినను, తరువాత తరువాత, మహాశయులు బేరమాడకుండుటయు నడిగినధన మిచ్చుటయుఁ జూచి చెవిలో రహస్యముగ తగ్గుధరలఁజెప్పుటగాని చెట్టింపుసరకుల నిచ్చుటగాని చేయువాడు. వర్తకులు ఆతడు తమవద్ద ముందుకొని నచో తమకు ఎక్కుడు లాభమువచ్చునని యొకనమ్మిక గల్గియుండిరి. అందువలన నాతఁడు బజారునకుఁ బోవునప్పుడెల్ల వర్తకులు తమవద్ద ముందు కొనుడని ప్రతివారును బ్రతిమాలువారు.

# జన్మస్థాన నివాసము

నాగమహాశయుని కొక్కొకసారి అతిథులకు భోజనవసతి సదుపాయములఁ జేయుటయేగాక దారి బత్తెములకుఁ గూడ నిచ్చుట తటస్థించెడిది. ఒకమారొక యతిథి అతనిఁ జూచుటకు వచ్చి జబ్బుపడెను. మహాశయుఁ డతనికిఁ బరిచర్య సలిపి నెమ్మదిగనున్న తరువాత దారి బత్తెములకుఁ గొంత సొమ్మిచ్చి యింటికిఁ బంపెను. ఇట్టివి తరచు జరుగుచుండెడివి.

పరిమితి లేని యీ వ్యయమువలన మహాశయు లప్పుల పాలయ్యెను. అతని భక్తులలో కొంతమంది ఋణములను దీర్ప నుద్యుక్తులైరి. కాని యాతఁడా యుపకారమునెంతయు నిరసించెను. వివేకానందు లమెరికా దేశమునుండి మరలివచ్చిన తరువాత మహాశయులు ఋణగ్రస్తుఁడైనట్లు తెలిసికొని ఋణవిముక్తునిఁ జేయ సాహసించెను. కాని మహాశయులు నెమ్మదిగ "సన్యాసులు నాకిడు ఆశీర్వచనములే చాలును. కష్టమో సుఖమో నా కుటుంబ మెప్పుడును 'పాలు'లిచ్చు వేతనము మీదనే జీవింపవలె"ననెను. ఇక నాతని భక్తులెవరైన ఋణము మాట జ్ఞాపకము చేసినచో "నయ్యా! జీవనాధార మేమియు గన్పడకున్న నుపవాసమైన నుందుము గాని గృహస్థాశ్రమసద్ధర్మము మాత్రము విడువజాలను. నా దుఃఖస్థితిగూర్చి మీ రెవ్వరును కష్టపడవలదని ప్రార్థించుచున్నాను. భగవానులగు శ్రీ రామకృష్ణులు తమకేది యుచితమని తోచునో యదియే చేయుగాక"యని యనును.

తనపనులకు లేదు సరికదా గృహకార్యముల నిమిత్తమైనను సేవకుల నియమించుట కాతఁడెంతయు సంతాపపడును. తనయింటి మరమ్మతులకై తాపీవాండ్రు మొదలగు సేవకులు పనిచేయుచో సహింపజాలఁడు. అందువలన మహాశయుఁ డింట లేనప్పుడు అతని భార్య ఇంటి కప్పువేయుట మొదలగు మరమ్మతులను చేయించెడిది.

# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

ఒక తరి నాగమహాశయులు చాలకాలమువరకు నింటనుండుట తటస్థించెను. అందువలన ఇల్లు బాగుచేయించుట కవకాశము లేకుండెను. గృహము నివాసానర్హమై యుండెను. ఇక చేయునది లేక శరత్కుమారి కూలివాండ్ర ఇంటికప్పును తిరుగనేయుటకుఁ బిలిపించెను. కూలివాండ్రింట ప్రవేశింపఁగనే మహాశయులొక మహాపాపకార్యము తన యింటఁ జరుగనున్నట్లు, పిచ్చియెత్తి కేకలిడెను. మొదట నొక చిలుము తయారుచేసి తాఁ పేస్త్రీ కిచ్చెను. పిమ్మట నాతడింటిపైకెక్కి యనూర్యాతపమునఁ బనిచేయుచుండఁ జూచి సహింపలేక నాతనిని దిగిరమ్మని దీనముగఁ బ్రతిమాలుకొనెను. అయిన నాతడు తన పని సాగించుటఁ జూచి పట్టజాలక తండ్రి! నన్నీ దుర్భరమగు గృహస్థాశ్రమ మెందులకు స్వీకరింపు మంటివి? అయ్యో నా సుఖము కొరకన్యులు బాధపడుట చూడవలసివచ్చె గదా! పాప ముపశమించుగాత! గార్హస్థ్య మనుగంటు గాక" యని నెత్తిమోదుకొనసాగెను. ఈతని వ్యాకులత్వముజూచి యాతడు దిగివచ్చెను. మహాశయులు తక్షణమే వానిదగ్గరకుఁ బర్వెత్తి వేరొక చిలుమునిచ్చి, విశ్వాసపాత్రుఁడగు సేవకునివలె విసరనారంభించెను. పిమ్మట నాతనికా దినవేతనమిచ్చి యింటికిఁ బంపెను.

నాగమహాశయు లెన్నఁడైన పడవలో ప్రయాణముఁజేయవలసి వచ్చినప్పుడు, పడవవానిని పడవను త్రోయనీకఁ దానే తెడ్డువేయును. ఒక్కొకసారి తక్కుంగల బాటసార్లాతని నిరోధించువారు. కానివారి మాట లెన్నడును లెక్కకు రాలేదు. అందువలననే కొందరు పడవవాండ్రు తమ నావలలో నాతని నెక్కించుకొనువారుకారు. అట్టి మహాపురుషుడు తామందుండగ నావత్రోయుట పాపమని తలచువారు. వర్షాకాలమునందు దియోభాగంతయు నీటితో మునిగియుండును. పడవలేక ఎవ్వరును ఇంటినుండి కదలలేక పోవువారు. అందుచే ప్రతి

గృహమునకు ఒక నావయుండుట తప్పనిసరి యైయుండెను. కాని మహాశయులకు స్వంతపడవ లేదు. దానఁనాతడు వర్షాకాలములో చాలభాగము ఇంటనే గడుపవలసివచ్చెడిది. అయినను ఒకొక్కప్పుడు పడవ యత్యావశ్యక మనిపించును. అందువలన ముందే గృహకృత్యములకు వలయు సంభారములను సిద్ధముచేయవలసివచ్చెడిది. ఈపని యాతనిభార్యయే యిరుగుపొరుగువారి సహాయమున నిర్వర్తించెడిది.

ప్రతి సాయంతనమును నాగమహాశయులు శ్రీరామకృష్ణ విగ్రహమునకు ధూపదీప నైవేద్యాదుల నర్పించును. భక్తులు వచ్చినదినమున ఆతనియింట భగవత్సంకీర్తనము జరిగెడివి కాని అందాతడెన్నడును పాల్గొనక ఒకమూలఁగూర్చొని చిలుములను తయారుచేయును. అయినను ఆతని సమక్షమున నొక అసహజమగు ఆవేశమా సంకీర్తనయం దుద్భవించెడిది. సంకీర్తనానంతరము నాతఁడు శ్రీరామకృష్ణనామము నుచ్చైస్స్వరమున జపించుచు చైతన్యవిహీనుడై యుండును.

ఒక్క సంకీర్తనయందేగాక తక్కిన ప్రార్థనా సమయము లందుగూడ మహాశయుని గృహమున భక్తి మూర్తీభవించియుండును. ఒకమా రాతనిగృహమునకు శరచ్చంద్ర చక్రవర్తివచ్చెను. మహాశయుని కోరికపై ఆతడు ఉపనిషత్తులలో కొన్నిటఁ గొంతభాగము చదివి వివిధార్థములతో పాటు ఒక్కింత తన యభిప్రాయమును జతచేయుచు బోధచేసెను. అంతయు సాంతముగ విని "అన్ని యర్థములును సత్యములే. వేర్వేరాచార్యులు వేర్వేరు మతస్థులకు తగునట్లు చెప్పిరి. ఇది వ్యాఖ్యాతల తప్పుకాదు" అనుచు, శ్రీరామకృష్ణుడు ఊసరవిల్లి సామ్యము నుదాహరించుచుచెప్పిన మహావాక్యమును నుడివి, "ఈశ్వరుఁ

డనేకరూపములతో విరాజిల్లును. ఎవ రెట్లాతని నర్థము చేసికొందురో, అట్లు వారు వర్ణింతురు. ఎవరును ఆతనినిజస్వరూప మిట్టిదని నిర్ణయింపలే" రనెను. తదనంతరము సరస్వతీవిగ్రహమును జూపుచు "ఇయ్యాదియు సత్యమే. ఎందరెందరో దేవులను దేవతలనుకొల్చి తరింపలేదు!" అనుచు ఆవిగ్రహమునకుం దనేకమారులు సాగిలపడెను. ఆ సమయమున నర్చకుఁ డతివైభవముతో పూజలొనర్చుచుండ నాప్రదేశమంతయు స్వర్గధామ మట్లుండెను. మహాశయు లంత లేచి "తల్లి విద్యాస్వరూపిణి. ఆమె కృపాలేశము లేకున్నచో జ్ఞానోపలబ్ధి కాజాలదు. జనని నన్ను జ్ఞానినిగ నొనర్చి ఈ శూద్రకుటుంబమున జన్మింపజేసినది. నేను శాస్త్రపఠనమున కనర్హు డను. అందువలన మీరా శాస్త్రార్థములను వినిపించి నన్ను కృతార్థుని జేయుఁ"డనెను. ఈతని దృఢభక్తినిచూచి "ఈతఁడు భక్తిసాధనయందు చాల నభివృద్ధిపొంది కొన్ని దివ్యదర్శనములఁ గనియుండవచ్చును. కాని బ్రహ్మజ్ఞానమును ఇంకను బొందియున్నట్లు లేదు"అని చింతించుచుండ మహాశయు లచ్చోటు పాసివెళ్లెను. కొంతసేపటికా భక్తుఁడు మహాశయుని వెదకుచు ఇంటివెలుపలకురాగా, ఆతఁడొక సాలవృక్షము క్రింద పడియుండెను. భక్తుఁ డాతని ప్రక్కకేగి నిల్చొనెను. అంత మహాశయులు "అమృణ్మయ విగ్రహరూపముననున్న నాతల్లి ప్రేమమయి. ఆద్యంతరహితయగు సచ్చిదానంద స్వరూపిణి. నాజనని జ్ఞానసముద్రము" అనుచు సమాధిస్థితిని బొందెను. ఒక యరగంటకాలము వరకట్లే చైతన్యరహితుడై పడియుండెను.

ఇట్టి సమాధులలో అతఁడు తరచు గంటలతరబడి పడియుండును. కొన్ని దినముల ప్రాణాపాయము తటస్థించునేమోయని శంకించువరకు స్మృతివిహీనుఁడై యుండువాఁడు.

# నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

నాగమహాశయు లెప్పుడు కలకత్తాకుఁ బోయినను మున్ముందు కాళీఘట్టములోనున్న దేవిని సేవించి యటనుండి గిరీశబాబుదర్శనము నకై పోవువాఁడు. "ఎవరైన గిరీశునితో నిముషమాత్రము కాలము గడపినను ప్రాపంచికవిషయవిముక్తుఁ డగును. గిరీశునకు మనుజుని చూడఁగనే యాతనిస్వభావమును గుర్తించు అంతరదృష్టికలదు. ఆదృష్టి ప్రభావముచేతనే ఆతఁడు శ్రీరామకృష్ణుని యవతారపురుషునిగ గ్రహింపగలిగె"నని మహాశయులు గిరీశునిగూర్చి యనువాఁడు. మరియు గిరీశనామోచ్చారణ మాత్రమున వంగి నమస్కరించును. శ్రీరామకృష్ణ శిష్యవర్గములో గిరీశున కాతఁడు ప్రథమస్థానము నొసంగెను.

ఒకపరి మహాశయులు దుర్గాపూజకు వలయు సంభారములను గొనితెచ్చుటకు కలకత్తాకు పోయెను. అప్పుడు గిరీశబాబు గృహమునకేగెను. ఇతని రాకఁ జూచి గిరీశుఁడు మేడదిగివచ్చి ఆదరముతో పైకిఁ గొంపోయి, యొక కుర్చీపైఁ గూర్చుండుమనెను. కాని మహాశయులు క్రిందకూర్చొనెను. ఇదిచూచి యచ్చటనున్న యొకరు పైన కూర్చుండుమని నిర్బంధించెను. అంత గిరీశుఁడు "అయ్యా! ఆయనను నిర్బధింపకుము. ఆయనను యిచ్చవచ్చినచోటనే కూర్చుండనిండు" అనెను. అంతట మహాశయులను శ్రీరామకృష్ణునిగూర్చి యేదేని చెప్పుమని కోరెను. అందులకాతఁ "డయ్యా! ఆమహాత్ముని తెలిసికొనుటకు నేనెంతటివాఁడను! నేను వట్టిమూఢుఁడను. ఆయన నెట్లు తెలిసికొందును. మీరు నాపై దయగొని నన్నాయన పాద పద్మములపై యారని భక్తికలిగియుండునట్లాశీర్వదింపు"డనెను. ఇట్లు చెప్పునప్పుడు మహాశయుని ముఖముపై శాంతమును నమ్రతయు తాం

డవించుచుండెను. అంత గిరీశుండు "అందువలననే శ్రీరామకృష్ణునినే నవతారమూర్తిగ నెన్నుట. ఏ మహాత్ముని కృపాకటాక్షమున ఇట్టి మార్పు,- ఒకమనుష్యమాత్రుని మనస్సున నిట్టిస్థితి,- కలిగెనో ఆతండొక యవతారమూర్తి కాకయుండుట ఎట్లగును? ఆతండు మానవాతీతుండనుటకు సందియములేద"నెను. ఇంకను కొంతకాలము శ్రీరామకృష్ణునిగూర్చి ప్రసంగించినతరువాత మహాశయు లాదినమునకు సెలవుగైకొని వెడలిపోయెను.

శ్రీరామకృష్ణుని సన్న్యాస శిష్యులు అప్పుడు ఆలంబజార్ మఠములో నుండిరి. ఒక యాదివారమున మహాశయులా సన్న్యాసుల దర్శనార్థమై యచ్చోటికి బోయెను. అచ్చట చాలమందియుండిరి. మహాశయులు వారలందరకును సాష్టాంగముగ నమస్కరించెను. ఆతని రాకడ మఠమున నతిశయ సంతోషకారణమయ్యెను. ఆనందము తాండవించెను. సోదరశిష్యులు మహాశయుని కుశలమడిగిరి. ఆసమయమున రామకృష్ణానందస్వామి సాయంకాల పూజనొనర్చుచుండెను. మహాశయుడుకూడ అందు పాల్గొనెను. అంత నందరును భోజనమునకై కూర్చొనిరి. మహాశయునికొక పళ్లెరమున వడ్డించిరి. ప్రసాదమును గొనినతరువాత వారెంతవేడుకొనినను వినక తానే స్వయముగా ఆ పళ్లెరమును శుభ్రపరచెను. అనంతరము వారందరకును చిలుములను తయారుచేసెను. ఆ రాత్రి యుక్కపోతగ నుంటచే, జపధ్యాన నిమగ్నుడై యా మఠమునందే గడపెను.

శ్రీరామకృష్ణ నిర్యాణానంతరము మహాశయులు చాలకాలము వరకు దక్షిణేశ్వరమునకు బోలేదు. ఒకనాడు సురేశుడును చక్రవర్తియును నింకొక భక్తుడును వెంటరాఁ దక్షిణేశ్వరమునకై బయల్వెడలెను. మార్గమధ్యమున శ్రీరామకృష్ణుండు తన యంత్యదివసముల

గడపిన కాశీపురోద్యాన గృహముగలదు. సురేశుడా ఇంటిని చక్రవర్తికి చూపుచుండెను. కాశీపుర నామము విన్నంతమాత్రముననే మహాశయుల యొడలు కంపింపసాగెను. ఆ గృహమునైపు కనుల జూడలేకపోయెను. ముఖము కళావిహీనమై యెండిపోయినట్లయ్యెను. శ్రీరామకృష్ణుని నిర్యాణవిషయమై చర్చవచ్చినప్పుడెల్ల మహాశయులు "ఇదియంతయు ఆమహాత్ముని లీలామాత్రమే. ప్రాణికోటికి ముక్తి నిచ్చుటకై ఆ వ్యాధిని తనకు తానే తెచ్చిపెట్టుకొనె"ననును. ఈ దారిని నడచుట కాతని కిది రెండవతూరి.

మిత్రులు మువ్వురును దక్షిణేశ్వరము చేరిరి. ద్వారప్రాంగణమున మహాశయులు సాగిలపడెను. చక్రవర్తి యిదివరలో ఈ ప్రదేశమును చూచియెరుగడు. అందువలన సురేశు డతనికి శ్రీరామకృష్ణుడు జపముసల్పిన ప్రదేశములను బిల్వవృక్షము, పంచవటి మున్నగువానిని చూపించుచుండెను. మహాశయుడు వారితో నొక ప్రాణవిహీనమగు విగ్రహమువలె పోవుచుండెను. ఆతని మనమప్పు డెచ్చట నుండెనో ఎఱుగ నశక్యము. తరువాత వారు శ్రీరామకృష్ణు డుండిన గదిని సమీపించిరి. ఆగదిని సమీపించునప్పటికి మహాశయుడు "అయ్యో, తండ్రీ! ఇచ్చటనేమి మాచుటకు వచ్చితి"నని యాగదివద్ద నిలువున గూలెను. చక్రవర్తి లేవదీసెను. కాని ఎన్నివిధముల ప్రయత్నించినను, ఆతని నా గదిలోనికి తీసికొనిపోవుట యశక్యమయ్యెను. ఆతడు తనజీవితమున నెన్నడును ఆగదిలోనికిపోయి యెరుగడు. దక్షిణేశ్వరమున కేగినపుడెల్ల దూరమునుండి యాగదికి ప్రణామ మాచరించి వెడలిపోవువాడు.

ఆదినముననే శ్రీరామకృష్ణుని మేనల్లుడగు హృదయముఖోపాధ్యాయుడు అచ్చటికి వచ్చియుండెను. ఆతనివద్ద కొన్నిబట్ట

లుండెను. ముఖము విచారగ్రస్తమై వాడియుండెను. ఇప్పుడాతడు బట్టల నమ్ముకొనుచు జీవించుచుండెను. అతడు మహాశయుని బాగుగ నెరిగియుంటచే యిద్దరును శ్రీరామకృష్ణునిగూర్చి ముచ్చటింప నారంభించిరి. జగన్మాతపై హృదయుడు కొన్ని పాటలను పాడెను. మహాశయుడు వానిని విని 'శ్రీగురుదేవుడీ పాటలనే పాడుచుండువా, డనెను. తరువాత హృదయుం డతివిచారముతో "మీరలుగదా ధన్యతములు. ఆ మహాత్ముని యవ్యాజ కరుణామృతము మీపై వర్షింప ధన్యులైతిరి. కాని నేనుమాత్రము జీవనోపాధికై యింటింటికి వీధివీధికి తిరుగుచు బట్టల నమ్ముకొనవలసిన వాడనైతిని. మామ నాపైయొక్కింత దయార్ద్రదృష్టిం బరపియుండుచో ధన్యుడనై యుందును" అని వేదనచే హృదయము బరువెక్క బాలునివలె దుఃఖమాపుకొనలేక కన్నీరు కాల్వలుగట్టి విలపించెను. తరువాత వారు మార్గమధ్యమున నుండిన అలంబజారు మఠములోనికిబోయి సాయం ప్రార్థనలగావించి ప్రసాదము స్వీకరించి గృహోన్ముఖులైరి. రామకృష్ణానందుడు వారలను కొంత వరకు సాగనంపెను. హృదయుడును మహాశయుడును రామకృష్ణానందుని సెలవుగైకొని గిరీశుని గృహముజేరిరి. అచ్చటనుండి మహాశయులు తన బసకు బయలుదేరిరి.

ఈ కాలమున మాతృదేవి (శ్రీరామకృష్ణుని ధర్మపత్ని) గంగానదీతీరముననున్న నీలాంబర బాబుతోట యింటియందు నివసించుచుండెను. ఒక యాదివారమునాడు మహాశయుం డామెను చూడబోయెను. పోవునప్పుడు కొంత మిఠాయియు, ఒక ఎర్రని యంచుగల వస్త్రమును గొంపోయెను. చక్రవర్తియు నాతనితో నేగెను. మధ్య మధ్య మహాశయులు బాలునివలె "అమ్మా! అమ్మా!" యనుచు కేకలిడుచుండెను. కొంతవడికి వారిద్దరును అహిరితోలా ఘట్టము

# నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

సమీపించి యుం గంగానదినిదాటి కొలదికాలములో బేలూరును చేరిరి. మహాశయుని వేదన యధికమయ్యెను. పెద్దగాలికి ఆడిపోవు నెండుటాకువలె దేహము వడకసాగెను. ప్రేమానందస్వామి యల్లం తమారమునసే ఈతనిజూచి యాతని యాగమనము మాతృదేవికి దెలియపరచెను మహాశయులు గృహమును సమీపింపగనే ప్రేమానందుడు ప్రేమపూరిత హృదయముతో మహాశయుని బట్టుకొని దేవి సమ్ముఖమునకు గొంపోయెను. అం నొక యరగంట సేపు ఉన్నతరువాత అందఱును ఈవలికివచ్చిరి. మహాశయుడు అసంపూర్ణస్మృతితో “తల్లి తండ్రికంటె నెక్కుడు దయచూపించు”నసెను. అంత ప్రేమానందుడు “ఆహా! ఈ దినమున మాతృదేవి మహాశయునిపై తన ప్రేమ జ్యోత్స్నను బ్రకాశింపజేసినది. ఆతడు తెచ్చిన మధురపదార్థముల దాను స్వీకరించి స్వహస్తముతో ప్రసాదమిడినది ధన్యుడుగదా ఈపుణ్యాతముడు” అనెను. కొంతసేపట్లుగడపి మిత్రులిర్వురును మరల కలకత్తాకు మరలిరి.

మాతృదేవి మహాశయుని కొక వస్త్రమును కానుకగా నొసంగెను. దానినాతడు పూజా సూచకముగ సరకులను కొనుటకు అంగడికి బోవునప్పుడు శిరమున ధరించుచుండెను.

మహాశయులు పూజకువలయు సంభారముల నన్నిటిని “పాలుల”నుండి యుప్పు వర్తకముపై వచ్చు ఆదాయభాగము నుండి కొనితెచ్చుచుండెను. ఒకసారి సరకులకై కలకత్తాకు పోయినప్పు డొకభక్తుని కోరికపై దేవికి విసరుటకై యొక వెండిపిడిగల చామరమొక దానినికొని ఇతర సరకులతోఁగూడ స్వస్థలాభిముఖుడయ్యెను. సాగనంపుటకు వచ్చిన మిత్రుడు సామానుల నందిచ్చు తొందరలో తనగొడుగు నాతడెక్కిన రైలుపెట్టెలో పొరపాటున

విడిచిపోయెను. పాపమాతడు గొడుగును మరచిపోయినాడని దానిని కాపాడుచుండ కొండొక ప్రయాణికుడు అడితనదని మహాశయుడెంత చెప్పినను వినక తీసికొనెను. బండి కదలినతరువాత నా ప్రయాణికుడు మైమరచి నిద్ర చెందెను. దానిచే నాతడు గమ్యస్థానమునుదాటి చాలదూరము పోయెను. అచ్చట ఎక్కువయైన సుంకమిచ్చుటకాతని వద్ద పైకము లేకపోవుటచే అధికారులు ఆతనిని ఆ స్టేషనులో ఆపిరి. మహాశయులీ సంగతిని జ్ఞప్తికి దెచ్చుచు "చెడుకార్యముల కెల్లప్పుడును శీఘ్రముగనే ఫలము గలుగును. కాని మందబుద్ధులగు మానవులు తెలిసికొనలేక యున్నారు." అనెను.

ఆ రైలుపెట్టెలోనే యొకడు తన యుంపుడుకత్తెతో ప్రయాణము చేయుచుండెను. మహాశయుడు వారిని చూడగనే యొక దృశ్యమును గనెను. ఒక భూతము ఆ మనుజుని కంఠము నొడిసిపట్టి రక్తమును పీల్చుచుండెను. చూచుచుండగనే ఆ వ్యక్తి రక్తమాంసములెల్ల పోయి శల్యావశిష్టుడయ్యెను. అంత మహాశయులు నిశ్చేష్టుడై "అమ్మా అమ్మా"యని కేకలిడెను. ఆతడీ విషయమై "ఇది యంతయు సత్యము. నమ్ముడు. దీనినంతయు ఈ కండ్లతోనే చూచితిని" అనెను.

ఈసారిమాత్రము నాగమహాశయులు దుర్గాపూజానంతరమున కొలదికాలమునకే కలకత్తాకు మరలిపోయిరి. కలకత్తాలో నున్నంత కాలమును సురేశచక్రవర్తులతో తరచు అలంబజారునకు దక్షిణేశ్వరమునకు గిరీశుని గృహమునకు పోవుచుండువారు.

కుమార్తులీలోనున్న ఈతని బసకు పెక్కుమంది వచ్చువారు. కాని అందెవరైన ఆతనియెడ గౌరవభావముగాని యణకువగాని చూపుచో "అయ్యా! మాంస యుతమగునీ యస్థిపంజరముననే

మున్నది? శ్రీరామకృష్ణునిగూర్చి యేదైన చెప్పి నా యాత్మకు శాంతి యొనగూర్పు" డనువాఁడు.

అప్పుడప్పుడు గిరీశబాబు మహాశయుని కాతిథ్యమిచ్చువాఁడు. మహాశయుఁ డానందమున దప్పక స్వీకరించువాఁడు. గిరీశుని గృహమున భుజించుచో దేహాత్మలు రెండును పరిశుద్ధమగు ననువాఁడు. శ్రీరామకృష్ణ శిష్యులలో నెవరి యింటనైనను సంకోచము లేక భుజించును. అట్టి చోటుల జాతిమత భేదములను పాటించక "ఇది జగన్నాథాలయము*" అనువాఁడు

మహాశయుఁ డొకనాఁడు గిరీశుని కతిథియయ్యెను. ఆనాఁడు శ్రీరామకృష్ణునికి కిచూరీలను నివేదనచేసి యా ప్రసాద మొక పళ్లెరమునను కూరల నింకొకదానిలోను వడ్డించిరి. అది చూచి మహాశయుఁ "డయ్యో! ఈ కూరలు జిహ్వాచాపల్యమును వృద్ధిచేయును. కనుక దయయుంచి తీసివేయుఁడ"ని ప్రార్థించుచు కొలదిమాత్రము కూరను కిచూరి యున్న పాత్రలోనికి గొనెను. చివరకు ఉప్పుగూడ చపలత్వమును వృద్ధిచేయునని తీసుకొనువాఁడు కాఁడు.

ఇంకొక దినమున గిరీశుడు విందునకు పిలచెను. ఆనాఁడు గిరీశుడు "కాయ్" చేపయొక్క గ్రుడ్లను కొన్నిటిని సంపాదించెను. కాని మహాశయులు, శాకాహారియగుటచే అతనిచే వీనిని తినిపించుటకష్టము. అతఁ డందులకొక పన్నాగమును పన్నెను. నాగమహాశయులు శ్రీరామకృష్ణ శిష్యవర్గమును తినరు తమ ప్రసాదము నిమ్మని యడుగుట కలదు. వారట్లిచ్చుట కెన్నఁడును ఒప్పుకొనువారు కారు. ఆనాఁడు

* పూరియందలి జగన్నాథాలయమున జాతిమత భేదముల పరిగణింపరు.

మహాశయులు గిరీశుని ప్రసాద మడిగినతోడనే "జయశ్రీరామకృష్ణ" యనుచు తన యాకునందు కొన్ని గ్రుడ్లపుతీసి యాతనికి ప్రసాదముగ నిచ్చెను. మహాశయు లది ప్రసాదమనుటచే మారుమాటాడక గ్రహించుచు "గిరీశా! నీబుద్ధి యతితీక్ష్ణము సుమా" యని ప్రశంసించెను.

శీతకాలమున మహాశయులు కప్పుకొనుటకు వస్త్రములేక చలిచే బాధపడు చుండెనని తెలిసి గిరీశుడు దేవేంద్రముజుమ్దారను ఒక భక్తునిచే నొకకంబళము నిచ్చిపంపెను. అది గిరీశుడు పంపినదైతేగి మహాశయు డద్దాని కన్నిమారులో నమస్కరించి శిరముపై నిడుకొనెను. మహాశయు డెట్టికొన్నను తీసికొనడని గిరీశు డెరుగును. కాని దేవేంద్రునివలన తానంపిన కంబళము స్వీకరింపబడెనని విని మిగుల సంతసించెను. అంత కొన్ని దినములకు, ఆతడద్దాని నుపయోగ పరచుకొనుటకు బదులు శిరముపై నిడికొని తిరుగుచుండెనని తెలిసి మిక్కిలి యాతురతపడి అద్దాని నిజస్థితి తెలిసికొనిరమ్మని దేవేంద్రు నంపెను. దేవేంద్రుడును తిరిగివచ్చి యాసంగతినే చెప్పెను.

కలకత్తాలో మూడుమాసము లుండి తరువాత మహాశయులు స్వస్థానమును చేరెను. దీనదయాళు దేహస్థితి ఆదినమున కాదినము క్షీణ దశకు వచ్చుచుండుటచే ఇప్పటినుండి తరచు కలకత్తాకు పోవాల సుండెను.

వివేకానందుడు మొదటిసారి అమెరికానుండి మరలివచ్చినప్పుడు చక్రవర్తి యాయనను చూడబోయెను. చక్రవర్తి మహాశయుని బాగుగ నెరుగునని తెలిసి యాయన "ఓయీ 'వయమ్‌తత్వాన్వే షానన్మధుకర హాతస్ త్వంగ్ ఖలుకృతీ' మన జీవితములన్నియు సత్యాన్వేషణమున నిరుపయోగముగ జరిగిపోయినవి. మనలో ఆతడొకడే శ్రీగురుదేవుల

కత్యంత ప్రియసుతుడు" అని తనకు మహాశయుని చూడవలెనని యున్నదని యట్లాతనికి జాబు నంపుమనియు కోరెను.

వివేకానందస్వామి అమెరికానుండి మరలి వచ్చెనను సంగతి తెలిసినతోడనే మహాశయుడు కలకత్తాకువచ్చెను. అప్పటికి బేలూరు మఠాలయపు కట్టడము పూర్తియగుటచే వివేకానందస్వామి యచ్చటనే వసించుచుండెను. మహాశయులు జాబు అందిననాటి సాయంకాలముననే అచ్చటికి చేరుకొనెను. స్వామినిగని సొగిలపడెను. స్వామికి రుగ్మతగనున్నది యని తెలిసి యాతురతతో "నీవు బంగారుగనివని ఠాకూరు చెప్పెడివారు. నీ యారోగ్యమును కాపాడుచో ప్రపంచమంతయు దుఃఖమునుండి యుద్ధరింపబడును. జగమంతయు నీపై యాధారపడియున్న"దనెను. అనంతరము స్వామి, మహాశయుని యాశ్రమమునం దుండుమనెను. అందుల కాతఁడు "హయ్యో! నేనేమిచేయుదును? గురవాజ్ఞనెట్లు తిరస్కరింతును? ఠాకూరు నన్ను ఇంటనే యుండుమని ఆజ్ఞాపించి"రనెను. మహాశయుని రాకచే ఆనాటి అధ్యయన పాఠశాలకు శిష్టానధ్యాయనము. అందరును మహాశయుని ముందు కూర్చొనిరి. స్వామి శ్రీరామకృష్ణ నామోచ్చారణ మొనర్చినంతనే మహాశయుడు త్తేజితుడై లేచి "జయ్ రామకృష్ణ, జయ్ రామకృష్ణ" యని యరచుచు, "క్రిందటిసారి నేను దక్షిణేశ్వరమునకు పోయినప్పుడు గురుదేవుడు కాన్పింపలేదు, కాని ఠాకూరి మఠమందిప్పుడు ప్రత్యక్షమై యున్నా"రనెను. వివేకానందుడు దేవాలయములను మఠములను నిర్మించు విషయముపై తన యభిప్రాయము నడుగ మహాశయులు, "ఇవియన్నియు దేవదేవుని యిచ్ఛానుసారముగ జరుగుచున్నవి. మీరుమాత్రము దేహారోగ్యమును కాపాడుకొనవలయును. మీశరీరపోషణమే సమస్త మానవులకు సుఖదాయకమై

దుఃఖవిముక్తిని కలుగజేయు"ననెను. అంత స్వామి తక్కుంగల సన్న్యాసుల దిక్కు మొగమై "మహాశయుని చూచినంతమాత్రముననే, దేవదేవుని యవ్యాజకరుణా కటాక్షమున మనుజుఁ డెంతటి యుచ్చస్థితికి రాఁగలుగునో మనకెల్లరకు తెలియఁగలదు. ఇంద్రియ నిగ్రహమునను వైరాగ్యమునను అతఁడే మనకన్న మిన్న"యనెను. కొంతసేపైన తరువాత నాగమహాశయుని పూజాప్రదేశమునకు తీసికొనిపోయిరి. అచ్చట మహాశయుఁడు సాష్టాంగపడెను.

ప్రతి సాయంత్రమునను వివేకానందస్వామి మఠముచుట్టును విహారార్థము నడయాడుట వాడుక. ఆనాడు మహాశయుడు కూడ ఆతని ననుసరించెను. మహాశయుడు రాత్రులు మఠమునందు గడపజాలడని ఎరిగియుంటచే స్వామి యొకశిష్యునితో నావను సిద్ధపరపుమని చెప్పెను. అప్పటికి కొలదివెలుతురుమాత్ర ముండెను. చీకటి పడుచుండుటచే స్వామి సెలవుగొనగోరి మహాశయు లాతనికి సాష్టాంగపడి "జయ శివావతారమూర్తీ! జయ శంకరా!" అనెను. స్వామి యాతని లేవనెత్తి "మహాశయా! అప్పుడప్పుడు నీ పవిత్రదర్శనమిచ్చి మమ్ము ధన్యులనుచేయుచుండు"మనెను. ఎన్నడైన స్వామినిగూర్చి సంభాషణవచ్చినయెడల "శంకరభగవానునకు జయము" అనును. స్వామి పశ్చిమదేశ దిగ్విజయ ప్రసంగమున మహాశయుడు భావప్రపూర్ణుడై, గద్గదకంఠుడై స్వామి గొప్పయవతారమూర్తియనువాఁడు.

బాగుబజారునందలి స్వర్గీయ బలరామబోసుని గృహమునకు శ్రీ రామకృష్ణుడు తరచు వచ్చుచుండువాఁడు. మహాశయు లా గృహము శ్రీవాసుని *పెరడని చెప్పువాడు. సాధారణముగ శ్రీరామ

* శ్రీవాసు గౌరాంగుని ఆప్తశిష్యులలో నొకఁడు. ఈతని గృహప్రాంగణమునకు గౌరాంగుడు తరచువచ్చుచుండువాడు.

# నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

కృష్ణునిశిష్యులు కలకత్తాకు వచ్చినప్పు డందు విడియువారు. అప్పటి కీతడు వారిదర్శనార్థమై పోవుచుండును. ఒకనా డట్లు పోయినప్పుడు చక్రవర్తి వెంటబడిగిలేను. ఆదినమున నా గృహమున బ్రహ్మానంద ప్రేమానందులు విడిసియుండిరి. వారేదోవిషయమై మాటలాడు చుండిరి. ఇంతలో మహాశయుండు రా ఆసంభాషణమును ముగించి శ్రీ రామకృష్ణునిగూర్చి ముచ్చటించిరి. తరువాత వారు గృహో న్ముఖు లగుచుండ బ్రహ్మానందు డిట్లనెను. "నాగమహాశయుని సన్నిధానమున మనస్సు అన్నివిషయములను మరచి గురుమహాశయుని జ్ఞప్తికి తెచ్చెను. ఇట్టి ఆధ్యాత్మికశక్తిసమన్వితు లుండుటచే గదా భగవత్తత్త్వము హిందూదేశమున ఇంకను నిలచియున్నది ? ఈతడే ధన్యతముఁడు". మహాశయునికి సన్యాససోదర శిష్యులయం దమిత గౌరవము. "వారు మానవమాత్రులుకారు. భగవల్లీలార్థ మవతరించిన దేవతాస్వరూపులు. వారిని తెలిసికొనుట ఎవరితరము." అనువాడు.

క్రముక్రమముగ దీనదయాళుని యంతిమ దివసములు సమీ పించెను. అంత్యకాలమంతయు ఈశ్వరప్రార్థన ధ్యానాదులయందే గడచెను. ప్రాపంచిక విషయంబులకు తనమనంబున, తావొసంగక ఎట్టికల్మషముచేతను స్పృశింపబడక యుండెను. ఒకనాటి ప్రాతః కాలమున మహాశయుడు తండ్రి చేయిపట్టుకొని నడపించుచుండెను. అంత హఠాత్తుగ దీనదయాళు స్మృతి విహీనుడై భూమిపైబడెను. మహాశయులు తండ్రిని చేతులపై లేవనెత్తి గృహములోనికి గొంపో యెను. అప్పటికి స్మృతివచ్చెను. మహాశయుడు తండ్రికి మరణ కాల మాసన్నమయ్యెనని తెలిసి వైద్యునికొరకు చెప్పిపంపి తా నాతని చెవియందు భగవన్నామము జపింపనొడగెను. మరణ సింసిద్ధుడై యున్న దీనదయాళుకూడ ఆతనిస్వరముతో తనకంఠ మైక్యముచేసి

దేవదేవునినామము జపించెను. ఇంతలో వైద్యుఁడు వచ్చెను. అది శిరస్సంబంధమైన వ్యాధియనియు, మిక్కిలి యపాయకరమైన స్థితిలో నుండెననియు ఇక జీవితాశ కన్పట్టదనియు చెప్పెను. పితా పుత్రు లిర్వురిట్లు ఈశ్వరనామము జపించుచుండ, దీనదయాళుఁ కంఠ మాగి పోయెను.

దీనదయాళు పరలోకగతుఁ డగునప్పటి కాతనికి ఎనుబదిసంవత్సరముల వయస్సు. తండ్రి యవసానదశయందుకూడ స్మృతిరహితుఁడై యుండక భగవన్నామము జపించుచు తన నాటకమునకు భరతవాక్యము చెప్పెనని మహాశయుఁడు సంతుష్టాంతరంగుఁడై యుండెను.

మతానుసారముగ మహాశయులు విచారసూచకములగు వస్త్రములను ధరించి, శాస్త్రవిధిప్రకారము హవిష్యమును మాత్రమే స్వీకరించి యుపవాసముండి పిండప్రదానమును యథావిధిగ నొనర్చెను. తరువాత తానిహమున తండ్రికొనర్పగల యంత్యకర్మయగు శ్రాద్ధకర్మ వచ్చెను. అది యెంతయో గొప్పగ చేయవలెనని యాతని అభిలాష. కోర్కెలుండవచ్చునుగాని తీర్చుకొనుటకు ధనమెచ్చటనుండివచ్చును?

ఈతనియెడ భక్తిగౌరవములుగల భక్తులు కొందరు "రాలీ"సోదరుల కంపెనీలో పనిచేయుండిరి. వారికీ సంగతి తెలిపి యాతని ఎరుక లేకయే తమలోతాము చందాలవైచుకొనిరి. మహాశయుని కీసంగతి ఎట్లో తెలిసి, వారిని తనకొరకై యట్లు కష్టపడవలదని వేడుకొనెను. చివరకు తన యింటిని అడుమానము పెట్టి ౫౦౦ రూపాయీలను, పొరుగుననున్న యొకర్తుకనుండి కొంత సొమ్మును ఋణముచేసి మొత్తము రు. ౧౨౦౦ లతో అత్యంత వైభవముగ శ్రాద్ధకర్మల నొనర్చెను.

# నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

అనంతర మాతడు గయకేగి శిరోముండనము గావించుకొని శాస్త్రవిధిగ పిండప్రదాన మిప్పించి మరల కలకత్తాకు వచ్చెను.

మహాశయులు పితృశ్రాద్ధకర్మలకై యప్పులపా లయ్యెనని "పాలుల"కు దెలిసి కుమార్తులిలో నున్న ఈతని గృహమున కద్దె ఎక్కువ చేయ నిశ్చయించుకొనిరి. రంజితుకూడ ఈ యుద్దేశ్యమును బలపరచెను. కాని మహాశయు డందుల కొప్పుకొనలేదు. చాలకాలము నుండి యందు అద్దెకుండిన కీర్తివాసుడు మహాశయుని ధార్మికభావమునకు సంతసించి తనకు తానే ఎక్కువ బాడుగ నిచ్చుట కియ్య కొనెను. కాని మహాశయులు తన యసమ్మతిని జూపుచు "కీర్తివాసా! నీవు రాత్రింబగళ్లు కష్టించి సంసారమును సాగించుకొనుచున్నావు అతి దుర్ఘటమున నద్దె యిచ్చుచుంటివి. నేను నీవద్దనుండి యెక్కువ అద్దెతీసికొనుట కంగీకరింపజాల" నెను. మహాశయులు కీర్తివాసుని పుత్రునివలె ప్రేమించుచుండెను. కీర్తివాసుడును మహాశయులు కలకత్తాలో నుండునంతకాలము ఎక్కువ గౌరవముతోను, ప్రేమతోను కొలుచుచుండెను. చాలకాలమువఱకు కీర్తివాసుడా గృహమందే యుండి మహాశయులుండిన గదిని శిథిలమైన యతని చాపను జాగ్రతతో కాపాడుచుండెను.

నాగమహాశయులు గయనుండి కలకత్తాకు మరలి వచ్చినప్పుడు శ్రీ మాతృదేవి బాగ్ బజారునం దుండెను. ఒకనాడామె దర్శనార్థమై యాతడు కొన్ని మధురపదార్థములను ఒకవస్త్రమును తీసికొనిపోవు చుండ మార్గమధ్యమున శూలనొప్పి యమితముగ వచ్చెను. అందువలన ముందున కొక్కయడుగైన నిడలేక ప్రాంతముననున్న యొకగృహావరణమధ్యమున స్మృతిరహితుడై పడిపోయెను. అట్లు రెండుగంట

లుంచినతరువాత బాధ కొంత యుపశమింప లేచెను. అచ్చటినుండి యింటికి బండిపై పోవచ్చును పోవుటకు వేలయు పైకము కూడ వద్ద నుండెను. కాని మొదట యనుకొనినట్లు మాతృదేవిని దర్శింపకుండ నింటికెట్లు మరలగలడు? అందువలన తనయశక్తతకు దుఃఖించి బాధ పూర్తిగ నుపశమిల్లినయనంతర మామె దర్శనము చేసికొని రాత్రి 9 గంటలకు యింటికి తిరిగిపోయెను.

ఆ సంవత్సరము ప్లేగువ్యాధి కలకత్తాలో నిరంకుశముగ వ్యాపించెను. ప్లేగుయొక్క ఆవిర్భావమున కదియే మొట్టమొదటిసారి. ధనికులు, పేదలు అను వివక్షతలేక నొక్కుమ్మడి యందరును కలకత్తా సరిహద్దులను దాటి పారిపోయిరి. పట్టణము పాడుపడిన ట్లుండెను. మెస్సర్సు "పాలులు" కూడ కలకత్తాలోనున్న తమగృహమును నాగమహాశయుని యాధిపత్యమున నునిచి వారి గ్రామమునకు పోయిరి. ఒక వంటబ్రాహ్మణుడును, ఒక బ్రాహ్మణోద్యోగి (గుమాస్తా)యు నింకొక నౌకరును మాత్రమే యాతనితో నుండిరి. ఒకనాడు చక్రవర్తి మహాశయునిజూచుటకు "పాలుల" గృహమునకుబోవ నాతడు కండ్లకు జోడువెట్టుకొని గీతాపారాయణము జేయుచుండెను. నాగమహాశయులు చక్రవర్తిని జూచి "ఇట్టి యజ్ఞానియు మూఢుడ నగు నాకు గీతార్థము బోధపడునా? నీవు బ్రాహ్మణుడవు, పండితుడవు కావున దయయుంచి నా కీశ్లోకార్థముం దెల్పుచు చదివి వినిపింపు" మని వేడుకొనెను. చక్రవర్తి యందలి

"కర్మణ్యకర్మ యః పశ్యేత్" అను శ్లోకము చదివి దానికి వివిధ వ్యాఖ్యాతలు వ్రాసిన వ్యాఖ్యానానుసారముగ నర్థముం జెప్పెను. ఆటీక లన్నిటియందును శ్రీధరస్వామి టీక యాతనికి నచ్చియుండుట వలన దాని నెంతో ప్రీతిపూర్వకముగ వినియాడెను

# నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

మూడుదినము లిట్లు సవ్యముగ జరిగిపోయెను. నాల్గవనాడు బ్రాహ్మణోద్యోగికి ప్లేగు వచ్చెను. వైద్యుని పిలచిరి. కాని యాతని కెవ రుపచారము సేయుదురు? ఎవ్వరుగూడ నారోగి ప్రక్కనుండుటకు సాహసింపఁజాలకపోయిరి. ఇక నాగమహాశయుం డొక్కడు మాత్రము పరిచర్య చేయవలసివచ్చెను. రోగ మభివృద్ధి జెందెను. వైద్యుడు నిరాశచేసికొని వదలెను. మృత్యువాతఁబడబోవు నారోగి మహాశయుని తన్నెట్లయిన గంగానదీతటమునకు జేర్చుమని వేడుకొనెను. మహాశయుని కెవ్వరును సాయము రాకపోవుటవలన నాతడే దగ్గరనున్న ఘట్టమునకు గొంపోవలసివచ్చెను. రోగి త్రోవలోనే "గంగా - గంగా" యని స్మరించుచు మహాశయుని యొడిలోనే ప్రాణముల విడిచెను. రోగి ప్లేగువ్యాధిచే మరణించుటవలన నా శవమును పూడ్చుట కెవ్వరును రాకుండిరి. కాని ఎట్టకేలకు మహాశయు లెక్కుడు ధన మిత్తు నని యాశపెట్టినతరువాత కొందరు బ్రాహ్మణు లద్దానిఁ బూడ్చిరి. ఈసత్కార్యమున నాతని కిరువదియైదు రూపాయీలు వ్యయ మయ్యెను. ఆదినమున సురేంద్రనాథసేను, అషుతోష చౌదరి, నరేంద్రనాథబోసు అను ముప్వురుజను లాతని జూచుట కొఱకని ఇంటికి పోయియుండిరి. వారితని చెయ్దిమును జూచి యాశ్చర్యపడిరి. నరేంద్రబోసు ఈతనికి పిచ్చిపట్టిపోయెననియే నమ్మెను.

ఒకదినమున నాగమహాశయులు కాళీఘట్ట స్థాపితమగు జగన్మాతదేవాలయమునకు బోయెను. మాతను దర్శించి మరలివచ్చుటలో మైదానమున నొకభక్తుని గలసికొనెను. భక్తు డితనికి "ఏడెను*" తోటల జూపుట కచ్చటికిఁ గొంపోయెను. తోటలోని కదుగువెట్టు

---

* కలకత్తాలో సుప్రసిద్ధములగు ఆరామములు.

ఆరంభమున మహాశయులు బాలునివలె ప్రతివస్తువును జూపి 'ఇది యేమి ? అది యేమి' ? అని ప్రశ్నింప మొదలిడెను. తరువాత మరలి వచ్చునప్పుడు, "మనుజుడు సౌఖ్యములకొరకై యనేకమార్గములంబడి పోవుచుండును. జీవితము సార్థకత జెంద జనన మరణ రహస్యముల దెలిసికొనుటకు ప్రయత్నించుట మాని యశాశ్వతములగు విషయేచ్ఛల ననుభవింపగోరును. ఈ ప్రపంచమును కొలది దినములలో వీడవలసి యుండునని తెలిసియు నిట్లున్నది. ప్రపంచమంతయు తామసిక రాజసిక ప్రకోపమై కామినీకాంచనాధీనమైయుండ నరు లర్ధానివెంట దవిలి యున్నారలై పోవుచున్నారు. తండ్రీ ! ఏమి నీ లీలలు ! ఏమి నీ నటనాకౌశలము ! నీ ప్రభావముముందు శుకాది మహర్షులుగూడ ముగ్ధులగుచున్నారుగదా ?" అనెను.

ఒకదినమున నాగమహాశయులును మఱికొందరు భక్తులును శ్రీ రామకృష్ణుని జీవితమునుగూర్చి ముచ్చటించుకొనుచుండిరి. అంత నచ్చటనున్న నిరంజనానందస్వామి మహాశయునితో "నయ్యా ! శ్రీగురుదేవుడు తమ్ముదాము నీచులమనియు, కించిజ్ఞులమనియు క్రిందు పరచుకొనవలదనియు నట్లుజేసినవారు తప్పక నధః పతితులగుదురనియు సెలవిచ్చిరి గదా. మీరేల ఇట్లు మిమ్ములనే నిందించుకొందురు ? అందరికంటె నల్పునిగ నేల భావించుకొందు" రనెను. మహాశయు లందుల "కయ్యా ! నాయల్పత్వమును నీచత్వమును నాకు ప్రతినిముషమును ప్రత్యక్షమగుచుండ నేనే శివుడ నని ఎట్లు తలంపగలను? "శివోహం" అని మీరు తలంపవచ్చును. గిరీశుడు తలంపవచ్చును. మీ భక్తి మేరువును బోలినది. నా కట్టిభక్తి లేదే ! మీ వెల్లనన్నాశీర్వదించినయెడల ఠాకూరు తన కృపావర్షమును నాపై వర్షించినయెడల నాజీవితము సార్థకముగాగలదు," అని ప్రత్యుత్తరమిచ్చెను. ఆతనిమాటలయందలి

# నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

ఇట్టి మనోనిశ్చయమును జూచి నిరంజనానందుడు మారుపల్క లేక పోయెను. ఈ విషయమునుగూర్చి ప్రసంగించుచు గిరీశు డిట్లనెను. "ఇట్టిమనోనిశ్చయముతో నహంభావమునెల్లపోద్రోలినయాతడే దక్క నొండెవడును నాగమహాశయుని యత్యుత్తమస్థితికి రాజాలడు. అట్టి వారు మెట్టినచోటు అతిపావనప్రదేశము కాగలదు.

గృహమున కేతెంచి మహాశయులు ఆనాడు తనయల్పత్వమునుగూర్చి తలపోయుచు కొంతమంది యాగంతుకుల యెదుట తానొక పాపములమూట యనియు కీటకాధముడ ననియు చెప్పెను. ఇంతలో నిరంజనానందుడు చెప్పిన మాటలు జ్ఞప్తికి రా "ఈ దినముననేకదా గిరీశుని ఇంట, కీటకాధముడనని తలచిన కీటకాధముడనే యగుదుననియు, అట్లుగాక నేనే శివుడనని భావించిన శివుడనే యగుదుననియు వింటిని. ఇక నాగతి ఏమి కావలయును" అనెను. కొంతవడికి మరల నిట్లనెను. "అట్లు కాదు. నిజము చెప్పుటయే మంచిది. నేను నిజముగ కీటకమాత్రుడనే. పుర్వును పుర్వని పిలుచుటయందెట్టి తప్పును లేదు. సత్యము పలుకుట నేరము గాదు. శ్రీ గురుదేవుని కృపాతిశయమునను సాధువర్యులగు మీ యొక్కయు గిరీశునియొక్కయు దయాతిరేకమునను నేను సత్యపరిపాలనమునుండి యెన్నడును తప్పకుందునుగాత!" ఇట్లు చెప్పుచు నచ్చటనుండినవారల కెల్ల నమస్కరించెను. శ్రీ గురుదేవుని మనసున నెంచి సాష్టాంగముగ నమస్కరించెను. తరువాత కొంతవడి యూరకుండి మరల నిట్లనెను. "ఈ యస్థిపంజరముపై నా కింకను ఇంత మోహముండగా నేనే శివుడనని నేనెట్లు చెప్పుకొనగలను? గిరీశు డసహాయశూరుడు. సాక్షాత్ భైరవాంశసంభూతుడు. కావున నాయన తాను శివుడనిచెప్పుకొనుట చెల్లును". గిరీశుడు తలంపునకు రా నాతనికి నమస్కరించెను. మరల

"అయ్యా ! నేను నీచాతినీచుడను. మీ కెట్టి సేవచేయగలను ? మీకు పొగాకు చిలుములను తయారుచేసి ఇచ్చుటకే తగుదును" అని చిలుములఁజేయ నారంభించెను.

రామకృష్ణ పురవాసియు శ్రీరామకృష్ణ భక్తాగ్రేసరుడు నగు శ్రీయుత నవగోపాల్ ఘోషు శ్రీరామకృష్ణ వార్షికోత్సవమును ఎక్కుడు వైభవముతో జేయ సమకట్టెను. బెంగాలీ వారపత్రికయగు "వసుమతీ" సంపాదకుడు బాబు ఉపేంద్రనాధ ముఖర్జీ నాగమహాశయుల నుత్సవమున కాహ్వానించెను. నాగమహాశయుఁడు ఉత్సవదినమున ప్రాతఃకాలముననే అహీరీతోలాలోనున్న యుపేంద్రుని గృహమునకు బోయెను. ఈతడు వచ్చుటకు ఉపేంద్రుడొక బండిని కుదిర్చియుండెను. కాని మహాశయుడు నడచివత్తునని చెప్పెను. గుఱ్ఱములను కొట్టినచో మహాశయులు సహింపలేడని యుపేంద్రుడెరిగి యుండుటచే బండి వానిని కొట్టవద్దని యాజ్ఞాపించి మహాశయుని యెంతో బ్రతిమాలి బండి నెక్కించెను. గమ్యస్థానమును జేరుచునే ప్రథమమున నవగోపాలబాబునకు సాష్టాంగ వందన మాచరించెను. తరువాత నింటి లోని కరిగి చావడిలో నొక మూల నిలువబడి యతిథులకు విసరమొదలిడెను. నవగోపాలబాబును తక్కుంగల యతిథులెంతేని బ్రతిమాలిరి. గాని లాభములేకపోయెను. రామకృష్ణపురమంతయు శ్రీరామకృష్ణుని పవిత్రనామముతో నానాదు ప్రతిధ్వనించెను. అతిథు లందరును శ్రీరామకృష్ణ సంకీర్తనమున మైమరచియుండిరి. శ్రీరామకృష్ణ భక్త సేవాపరాయణుడగు మహాశయునికి వారికి విసరుట దక్క కార్యమేమియు గన్పట్టలేదు. ఆమూల నట్లే విసరుచు నిల్చుండెను. తరువాత భక్తు లందరును ప్రసాదస్వీకారమునకు బోయినప్పుడు దాను గూడ ముకుళిత కరకమలుఁడై వారితో నేగెను. కాని వారి పంక్తిని కూర్చొ

మట కియ్యకొనలేదు. అందరును ఎంతయో వేడినమీదట ఒక్క మెతుకును మాత్రము స్వీకరించెను. ఈతని నడవడినిజూచి యంద రాశ్చర్య నిమగ్నులైరి.

ఉత్సవానంతరమున కలకత్తాకు మరలునప్పు డెందరు ప్రయత్నించినను మహాశయుని బండి నెక్కింపలేకపోయిరి. అందువలన వారంద రాతనితో నడువవలసినవారైరి. వచ్చునప్పుడు మహాశయులిట్లనెను. "శ్రీరామకృష్ణదేవుడు నవగోపాలుని భార్య విద్యాప్రకృతి స్వరూపిణి యనెను. ఈ భక్తవర్గమును కేవల మనుష్యమాత్రులని తలచువారు పశుప్రాయులు. మానవు లెన్నటికిని కాజాలరు".

అటుతర్వాత కలకత్తాయందు నాగమహాశయులు కొలదికాలమేయుండి స్వస్థానమునకు మరలిపోయెను. ఇట్లే కలకత్తాకుబోవుట కాతనికి కష్టపటిసారి.

శ్రీరామకృష్ణుడు దేహమును చాలించిన తరువాత మహాశయులు స్వస్థానమునకు బోయి, యచ్చట నేకాంతప్రదేశమున నొక కుటీరమును నిర్మించుకొని యందు తా నొక్కరుడుమాత్రము వసించుచుండునట్లు సంకల్పించెను. ఇది యాతని సహధర్మిణికి దెలిసి "మిమ్ము లను నేనే విషయమునుగూర్చియు గూడ నెన్నడును వేధించియుండ లేదు. ఇక వేధింపబోను. వేరుగ నుండు టెందులక"నెను. భార్య చెప్పిన యీ మాటలపై నమ్మకముంచి మహాశయు లాయింటియందే తన కుటుంబముతో నివసించుట కొప్పుకొనెను. కాని యింటియందు గార్హస్థ్యధర్మమున నుండెడ ననుమాట మాత్రమేగాని జీవితమును సన్న్యాసులకన్న నెక్కుడు కఠిన నియమములతో గడపెను. ఆతని భార్య ఆయనయం దేనాడును ఎట్టి మనోవికారమును బొడగాంచ

లేదు. "శ్రీరామకృష్ణ దివ్యనామముఁ గైకొని యాయన సకల విష యేచ్ఛల ద్రొక్కివైచెను. ప్రజ్వలితాగ్ని మధ్యమున నుండెను గాని దేహమెచ్చటను కనుగంటలేద" నెడిది.

ఒకమారు దియోభాగునందలి యాతని గృహమునకు కులగురువు సంతతివారగు నిద్దరేతెంచిరి. వారిలో నొకడు భక్తుడు. ఆతని పేరు నవీనచంద్రభట్టాచార్యుడు. దీనదయాళదేవునిగ నాతని బలవంతపర చుటచేత నాతడు మహాశయునిఁ జూచి "యోయీ! గృహస్థాశ్రమ ధర్మమును దెలిసికొని వివాహము చేసికొనుట యెందులకో, భార్య యనసేమో తెలిసి వంశమును నిలుపుటకై గడంగు"మనెను ఇది విని మహాశయుఁ డమితదుఃఖమున నిలువునఁ గూలబడి మూర్ఛనొందెను. ఒడ లంతయు గాయములుపడి రక్తసిక్తమయ్యెను. తరువాత కొంతవడికి తేఱి యాభక్తుని జూచి "యయ్యా! తమరు మా కులగురువుల సంతతి వారు, మరియు భక్తులు. అట్లుండియు నన్నిట్టి నీచకార్యమునకు సిద్ధ పడు మని యాజ్ఞఁ జేయుటకంటె వేరొక పాపకార్య ముండునా?" యనుచు ప్రక్కనున్న యొక యిటుకరాయిఁ దీసికొని తల పగిలి గాయమై రక్తము స్రవించువరకును కొట్టుకొనెను. ఇది చూచి యా భక్తుడు మిక్కిలి విచారించి తన యాజ్ఞను రద్దుచేసెను. తోడనే మహాశయుడు సంతోషముతో నాతని పాదధూళిని స్వీకరించెను.

ఒకతరి దీనదయాళు మహాశయునిఁ గోపమున నిట్లనెను. "సన్న్యాసివలె నిట్లుండిన నీకు కూడు గుడ్డలెట్లు వచ్చును?" అంత నాగమహాశయుడు "తండ్రీ! సంసారవిషయమై జిజ్ఞాస పడవలదు. వృక్షము లన్నియు తేఁకవుల్లె నెల్లప్పుడు నలరారుచునే యుండును. నాకు ఏ స్త్రీపైనను మోహమెన్నడును జనించియుండలేదు. జనని

# నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

గర్భమునుండి వెలువడినప్పు డెట్లుంటినో యిప్పుడు నట్లే యుంటిని. ఇక కట్టుకొనుటకు గుడ్డ యేల?" అనెను.

మహాశయుని సంసారవైముఖ్యమునకు దీనదయాళ తాతని తరచు మందలించువాడు. ఈ విషయమై తండ్రి కొడుకుల కొకనాడు వాద మేర్పడెను. మహాశయుడు ఉద్రేకముతో "నా జన్మమం దెన్నడును నాకు మోహము జనించియుండలేదు. ఈ ప్రపంచముతో నా కెట్టి సంబంధమును లేదు. నాహం నాహం (నేను కాదు, నేను కాదు,)" అనుచు దిగంబరుడై గృహమునుండి వెడలిపోయెను. ఇది చూచి భార్య వెక్కి వెక్కి ఏడువ నారంభించెను. ఆమెదుఃస్థితిఁ గాంచి జాలి గొని, మహాశయుని భక్తుడొకడు అతని మరల నింటికి గొనివచ్చెను.

దిమోభాగు వార్ధక్యము, మధ్య వయస్కురాలునగు వితంతు వొకర్తుక తరచు మహాశయునికడకు వచ్చుచు నొక గొప్ప భక్తురాలి వలె నటించుచుండెను. కాని యామె యపవిత్రభావమును, ఆమె దుర్వృత్తియు మహాశయుని సూక్ష్మదృష్టికి తెలియనయ్యెను. అట్టి వయసునందును గూడ నామె యట్టి భావముల గలిగియుండుట కాతడా మెను జాల యసహ్యించుకొనెను. ఈమె మనోభావములను మహా శయుని భార్య గ్రహించి యామె నింటికి రాకుండఁజేసెను. దీనిగూర్చి మహాశయు డిట్లు చెప్పువాడు. "అయ్యో! యీతుచ్ఛ, దుర్గంధపూరిత కళేబరమును కుక్కలును గ్రద్దలును గూడ చేనకజాలవు. అట్టి ఈ శరీ రముపై ఆమెకు మోహ మెట్లు కల్గెనో తెలియకున్నది. శ్రీ గురు దేవుఁడు నన్నింకను ఎన్నివిధముల పరీక్షించుచున్నాడు! కరుణా మయుఁడగు భగవంతుని కటాక్షము లేక మోహాంధకారమునుండి వెలు వడుట ఎట్టి వానికిని అసంభవము." అనెను. అప్పుడప్పు డీతని ముఖము

నుండి సులభగ్రాహ్యముగ గొప్ప వేదాంతసత్యములు గూడ వెలువడుచుండెను. మోహమున కెంత దూరమో భగవంతుని కంత దగ్గర యని యాతఁడు తరచు చెప్పువాఁడు.

కామినీవిషయమున నుండిన వైముఖ్యమునకన్న నాతనికి కాంచనముపట్లనె ఎక్కుడు వైముఖ్యము. ఒకతరి "పాలుల" బంధువులలో నొకనికి విషూచి తగిలెను. ఎన్ని వైద్యములో చేయించిరి. కాని రోగము తగ్గలేదు. వైద్యమందు మహాశయుని కౌశలమును ఎరిగియున్న వారగుట నాతని సాయపడుమని వేడుకొనిరి. మహాశయుడును మాట తీసివేయనేరక యొక హోమోపతీమందును చెప్పెను. ఆ మందు నీయగనే వ్యాధి కుదిరెను. వ్యాధి కుదిరెనను సంతసమున "పాలులు" మహాశయునికి బహుమాన మీయవలె నని కొంత సొమ్మును తీసికొని వెళ్లిరి. మహాశయుడు తీసికొనలేదు. వారెంతయో బలవంతపరచిరి. అంత మహాశయు డేడ్చుచు "అయ్యో! దైవమా! నన్ను ఈనిందార్హ మగు వృత్తిని ఏల నేర్చునట్లు చేసితివి? ఇందువలన నెన్ని పాపముల కొడిగట్టవలసియున్న"దనెను. ఆతని యాక్రందనమునుజూచి "పాలులు" "మహాశయా! నీవు మనుష్యమాత్రుడవు కా" వనిరి.

ఈ యలౌకికగృహమేధికృత్యము లన్నియు యలౌకికములుగనే యుండెడివి. "పాలుల".కోరికపై యొకనాడు మహాశయుడు భోజేశ్వరమునకు బోయెను. భోజేశ్వరమునుండి మరల కలకత్తాకుఁ బోవునప్పుడు దారిబత్తెములక్రింద నెనిమిది రూప్యములను, చలి నాపుకొనుట కొక కంబళము నిచ్చిరి. భోజేశ్వరమునుండి మోడరేవున కారు మైళ్ల దూరము. మహాశయుడు ఓడరేవును జేరి టిక్కెట్టు తీసికొనబోవు సమయమున నొక భిక్షుకి యైదార్గురు బిడ్డలు తన్ను బట్టికొని ,వేలాడు

# నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

చుండ మహాశయునకు నమస్కరించి యతిదీనముగ దన కష్టములను జెప్పుకొని తనకేమైన నిమ్మని ప్రార్థించెను. మహాశయు డామెదీనాలాపములకు జాలిగొని తనవద్దనున్న యెనిమిది రూప్యములను కంబళము నామెకిచ్చెను. భిక్షుకియు సంతసించి యాతని దీవించి వెడలిపోయెను. ఆరుమైళ్లు నడచుటవలన గలిగిన యలసట నపనయించుకొన నెంచి యట కొండొకతడవు విశ్రమించెను. ఓడరేవు విడిచిపోయిన తరువాత కలకత్తాకు నడుచుట కారంభించెను. అతనివద్ద ఏడణాల యారు పైసలు మాత్రముండెను. మార్గమధ్యమున నేదేని దేవాలయమున్న నందలి ప్రసాదము స్వీకరించియు మరొకప్పుడటుకులను భుజించియు ఆకలిని తీర్చుకొనుచు ప్రయాణము సాగించెను. నడుమ నదులను దాటవలసినప్పుడు చిన్నవైనచో నీదియు పెద్దవైనచో కొలది పైకమునకు చిన్న నావనెక్కియు దాటిపోవువాడు. ఇట్లు తనవద్దనున్న కొలది యణాలపై నాధారపడి ఇరువది దినములు ఏకదీక్షగ నడచి కలకత్తా చేరెను.

ఒకసారి మహాశయుడు ఉప్పువర్తకము పడిపోవుటచే దగ్గర పైకములేక మిక్కిలి దుస్థితియందుండెను. తరచు నిరాహారుడై పోవలసి వచ్చెడిది. అంతట, కొంతకాలమునకు "పాలులు" రెండువేల మణుగుల యుప్పును పంపిరి. అమ్ముటకై మహాశయుడు కిద్దర్ పురమునకు బోయెను. అంతయుప్పున కధమము ఏడురూప్యములైనను వచ్చియుండును. కాని మహాశయుడా యెండలో గూర్చొనియుండి పదమూడణాలకంటె నెక్కువ సంపాదింపలేకపోయెను. ఆ పదమూడణాలను తీసికొని యింటికి వచ్చుచుండగా దారిలో నొకడు తన కష్టములను చెప్పుకొని తనకేమైన నీయుమని వేడుకొన నా పదమూడణాల నాతని కిచ్చి రిక్తహస్తుడై యింటికి బోయెను. ఆ దినమున కాకలి బాపుకొనుట కింట నొక బియ్యపుగింజయైన లేకుండెను

# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

చిన్నతనమున పిల్లి మ్యావు మనుటయు కుక్క మొరుగుటయు మహాశయుని చెవిని, వాని క్షుద్బాధను సూచించు శబ్దములుగ, బడు చుండెను. అప్పు డతడు మేనత్తనుజూచి "అమ్మా! అవి యట్లేంకుల కేడ్చుచున్నవి? వాటికి కొంచె మాహారమిడరాదా?" యని కొంచె మన్నము తీసికొని "యన్నా! యేడ్వకుము. ఇదిగో యాహారము స్వీకరించు" మని పెట్టువాడు.

మహాశయుల ఇంటివద్ద నొక చిన్న చెరు వుండెను. అతడు పదమూడు పదునాల్గు సంవత్సరముల వయస్సున నుండినప్పు డనుదినమును భోజనానంతర మా చెరువునొద్దకు బోయి ముఖమును చేతులను ప్రక్షాళనము చేసికొనువాడు. ప్రక్షాళనార్థము పోవునప్పుడు దనతో నన్నమును పప్పును తీసికొనిపోవును. ఈతని చేతితో నిడు నాహారమున కలవాటుపడిన యా చెరువునందలి చేపలీతని పిలు పును వినగనే వచ్చి చేతినుండి యాపప్పును అన్నమును స్వీకరించె డివి. ఇట్లాతడు కలకత్తాకు విద్య నభ్యసించుటకు బోవువరకును చేప లతో నాడుకొనువాడు. మహాశయుడు పశుపక్ష్యాదులకు గూడ జ్ఞానము కలదనియు జన్మాంతరముల నుచ్చ జన్మల నెత్తి యవి ముక్తములగు ననియు చెప్పువాడు.

వేసవికాలమున నొకనాటియుదయమున మహాశయుడు గృహ మంటపమున గూర్చొని పొగ పీల్చుచుండ రెండు పెడవిషమైనపుగోరు వంక లాతనిముందు వ్రాలెను. మహాశయుడు వానిని గమనించక పోవుటచే నా గోరువంక లాతని పాదముల ముక్కుతో తాకి తాము వచ్చిన సమాచారమును తెలిపెను. అంత మహాశయుడు వానిని జేతుల లేవనెత్తి ముద్దుగొని "యమ్మలారా! వచ్చితిరా! ఇంచుకసే పాగుడు

# నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

ఆహారముఁ గొనివత్తు"నని లోనికి బోయి యన్నము దెచ్చి తన చేతులతో తినిపించెను. కాని వానియాకలి యింకను దీరక పోవుటచే నవి వాని ప్రక్క ప్రదక్షిణముచేయ నారంభించెను. మరల లోనికి బోయి మరి కొంత యన్నమును జలమును తెచ్చి యిడ నా పక్షులాతని చేతిపై గూర్చొని యా తెచ్చిన యాహారమును దిని తృప్తిచెందెను. తృప్తిచెందిన యనంతర మాపక్షుల నుపలాలించి "మీ రిక నరణ్యమున కేగి యిచ్చ వచ్చిన ట్లాడుకొని రేపే వేళకు రండన" నవి యెగిరిపోయెను. తరువాత నాగమహాశయు డిట్లనెను. "అహా! శ్రీరామకృష్ణుడు తన పుత్రులతో నెన్నివిధముల నాడుకొనుచున్నాడు. ఆతని వింతలీలల నెవ రెరుగగలరు ?"

నాగమహాశయు డహింసాధర్మప్రత్యక్షస్వరూప మని చెప్పవచ్చును. "అహింసా పరమో ధర్మః" అను సిద్ధాంతమును అతడు అక్షరము వదలక యనుష్ఠించెను. నారాయణగంజిలో జనపనార నుత్పత్తి చేయు (Jute Mills) యంత్రాలయములయందు పనిచేయుచుండిన యిర్వరాంగ్లేయోద్యోగులు వేట తమకమున దియోభాగునకు వచ్చిరి. తుపాకులధ్వని విని మహాశయుడు వారి దరికిఁ బరుగున బోయి చేతులు జోడించి "అయ్యా! దయయుంచి యీ దుష్కృత్యమునుఁ జేయవల" దని దీనముగ వేడుకొనెను. ఈతని మాటల యర్థమును తెలియక వారు తుపాకులను మరల దట్టించి కాల్చుటకు గొడంగిరి. మహాశయు డంతట బెదరించుచు, "కాల్చితివో జాగ్రత"యనెను. ఆ దొర లీత డున్మత్తుడని వారిపనులయందు మగ్నులై యుండిరి. తోడనే మహాశయు డొక్క క్షణమున వారిపై కురికి రెండు చేతులను రెండు తుపాకులను బట్టుకొనెను. తుపాకుల నాతని చేతినుండి తీసికొనుటకు వా రెంతయో ప్రయత్నించిరి. ఆతని సంకల్పశక్తి యపారముఁ గావున నాత డప్పుడు

సింహబలునివలె కన్పట్టెను. వారల కతనితో పెనఁగుట యసాధ్య మయ్యెను. తరువాత మహాశయు డా తుపాకుల నింటికి గొంపోయి యొకమూల నునిచి యట్టి ముష్కరాయుధముల తాకినందులకు రెండు చేతులను రాతిపై బెట్టి రాచి రాచి కడిగెను. ఉద్యోగులును నారాయణగంజికి బోయి యాతనిపై నభియోగము తే సమకట్టిరి. ఇంతలో మహాశయు డొక బంగాలీ యుద్యోగస్థునిచే నా యాయుధముల వారికి పంపివేసెను. ఆత డా తుపాకుల వారి కిచ్చి మాటసందర్భమున మహాశయుని సాధుస్వభావమును గూర్చి చెప్పెను. ఆతనిపై భక్తిగౌరవము లుదయింప వారు దమ యుద్దేశమును మార్చుకొనిరి. అప్పటినుండి వారు మరల నేటపై దియోబాగునకు బోలేదు.

మహాశయుడు ఎట్టి ప్రాణియైనను కష్టపడుట చూచి సహింపలేకుండెను. ప్రతివత్సరమును వరదలలో నెన్నియో చేపలు కొట్టుకొనివచ్చి యాతని ఇంటియొద్దనున్న చెరువునందు నివాస మేర్పరచుకొనును. ఒక దినమున నొక జాలరి యా చెరువునందు కొన్ని మత్స్యముల బట్టి యూరి కట్టుబాటు ప్రకారము చెరువు స్వంతదారునకు ఈయవలసిన భాగము నిచ్చుటకై మహాశయునియింటి కేగ నాతడా జాలరిగంపలో కొట్టుకొనుచున్న చేపలను జూచి జాలినొంది తత్‌క్షణ మా జాలరి యడిగిన రొక్కమిచ్చి వాటినన్నిటిని కొని మరల చెరువునఁ విడిచెను.

ఇంకొకదినమున వేరొక బెస్తవాడా తటాకమున చేపలఁ బట్టి యమ్ముటకై తని గృహమున కేగెను. ఈ సారి గూడ మహాశయుడు వాని నన్నిటిఁగొని యధారీతిగ చెరువునఁ విడిచెను. జాలరి దీనిని జూచి భయపడి యా చేపల వలయును తట్టయు తనకు జేరగనే యీ పిచ్చి

వాని బారినుండి పారిపోయెను. జన్మమధ్యమున మరల నాతఁడు మహాశయుని ప్రాకారమును దాటి ఎన్నడావైపునకు బోయి ఎఱుఁగడు.

మహాశయుఁడు అహింసావ్రతదీక్షయం దెంత పట్టుదలతో నుండెననఁ నాతఁడు సర్పములు మొదలగు క్రూరజంతువులఁగూడ చంపనొల్లకుండెను. ఒకపరి త్రాచుబా మొకటి యీతని పెరటిలోనికి వచ్చెను. దానిఁ జూచి యచ్చట నున్నవా రందరును భయభ్రాంతులైరి. ఈతనిభార్య మహాశయునితో నా పామును చంపివేయుట మంచిదని చెప్పెను. అంతుల నాతఁడు "అడవులలోనుండు ఈ పాములఁ జంపుట వలన నేమి రాగలదు? మన మనస్సులలో నున్న పామును జంపవలెను" అనుచు నా పామును సంబోధించి, చేతుల జోడించి "నీవు మనస్సు యొక్క ప్రత్యక్షస్వరూపమవు. నీకు యోగ్యనివాసము అరణ్యము. ఈ నా కుటీరమును విడిచి నీ నివాసమునకే బోయి నన్నాశీర్వదింపు" మనెను. ఈతని మాటలయందలి యర్థమును తెలిసిన దానివలె ఆపాము పడగను దించి యరణ్యమువైపునకుఁ బోయెను. మహాశయుఁడు తర చుగ "నీ బహిఃప్రకృతి మన మనస్సులయొక్క పరివర్తనమే. నీ వీ ప్రకృతి నెట్లు గూడ నెంచుకో నీ కది యటులనే గన్పించును. అది యద్దము వంటిది. దర్పణము నెదుట చేయు వెక్కిరింతల నెల్ల యందలి ప్రతిబింబము మనల కటులనే సమర్పించును." అనువాఁడు

ఒకదినము మహాశయుఁడు చెరువునందు ముఖప్రక్షాళనము చేయుచుండగా నొకపాము ఆతని కాలిబొటనవ్రేలిని కరచెను. పాము తన పనిని నిర్విఘ్నముగ జేయుటకై మహాశయుఁ డచ్చోటినుండి కదలలేదు. తరువాత నాతనిభార్య వచ్చి యీ వింత చూచి గడగడ వణకెను. మహాశయుఁడు అంత "ఎందు కిట్లు భయభ్రాంత వయ్యెదవు? ఉపద్రవ

మేమియును లేదు. పాప మీ నీటిపాము నా వ్రేలిఁ జూచి యది కప్ప యని భ్రమపడి పట్టుకొని త్వరలోఁ దన ప్రమాదమును తెలిసికొని నా కపాయము గలుగకుండ విడిచిపుచ్చినది" యనెను.

ప్రాణిలోకమునం దెల్ల నొక్క పరమాత్మయే నివసించుచుండె ననుట యాతని కనుభవసిద్ధము. సర్వలోకమును ఆ పరమాత్మయందే పుట్టి ఆ పరమాత్మయందే తమజీవయాత్రను గడపుచున్నవి యనుట యాతనికి సాక్షాత్కారము. ఎల్లప్పుడును నీవి క్రిందులకు చేతులను జోడించుకొని యుండు వలన తనకు సర్వప్రాణిలోకమునందును ఎల్లెడలను తన ఇష్టదేవత కానుపించుచుండె నని చెప్పవాఁడు. అతడు ఒక సజీవమగు పాదునుండి యొక గూరకును కోయుట కూడ నాతనికి కష్టముగ నుండెను. అందుమాత్ర మా పరమాత్మ స్పందనము లేదా? నాగమహాశయుఁడు చీమలు, దోమలు మొదలగు చిన్న ప్రాణులను గూడ నశ్రద్ధగ జూచువాఁడు కాడు. చీమలు తనపై ప్రాకినచో సంతోషమున వాని నింకొక క్షేమకర మగు స్థానమునకుఁ జేర్చువాఁడు. ఈ భూతదయార్ద్ర భావ మాతని మనమును సంపూర్ణముగ వశముచేసికొన నొక్కొక్కప్పుడు అతఁడు తన పాదముల క్రిందబడి యనేకజీవములు మృతిజెందు నని ఎచ్చటికిని బోకుండ నుండువాడు. ఒకొక్కప్పు డుచ్ఛ్వాసనిశ్వాసముల వలన గాలిలోని సూక్ష్మజీవములు నశించునని వాయువును బంధించు వాడు. అట్టి సందర్భము యందు ఆతని మరల నూపిరి సెల్చునట్లు చేయుట కొక సూత్రము "నీవు ఆత్మహత్యను చేయఁగడంగుచున్నా వనుటయే". ఆత్మహత్యనుగూర్చి శ్రీరామకృష్ణుడు చెప్పిన వాక్యముల నాతడు జవదాటనొల్లడు. "ఈశావాస్యమిదం సర్వం" అను నుపనిష ద్వాక్యము ననుభవసిద్ధముగఁ దెలిసికొని, అన్నిటను నొకే శివశక్తి

# నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

ప్రవహించుచున్నదని యెఱిగి మానవులకువలెనే చెట్లుచేమలకును సుఖ దుఃఖము లున్నవని గ్రహించి, తదనుగుణముగ దమజీవితమును గడపిన యనేక సాధుపుంగవుల జీవితములు మన హిందూదేశమున విశ్రుత పూర్వములు. ద్రవిడ వాఙ్మయమున నాళ్వారులయొక్కయు, నాయ నారులయొక్కయు జీవితములయం దిట్టి యనుభవము లెన్నియేని గలవు.

ఒకప్పు డీతనిభక్తులలో నొకడు మహాశయునియింటిచావడిలో గూర్చొని చావడికి తూర్పుభాగమున కాధారముగ నుంపబడిన స్తంభ ములను చెదలు పట్టియుండ జూచెను. తోడనే యాతడా స్తంభమును గొట్టగ నాచెదలు పురుగులు రాలి భూమిపై బడెను. మహాశయుడు దీనిని జూచి "అయ్యో! యిట్టిపని యొనర్చితివి! పాప మీ పురుగు లెంత కాలమునుండియో యీ స్థానమున శాంతిప్రదముగ నివసించుచుం డెను. ఇట్లు వీనిని చెదరగొట్టు టెంతక్రూరము! ఎంత యన్యాయము"ని చెప్పెను. ఇట్లు చెప్పుచుండు నాతని కన్నుల కరుణాశ్రువులు నిండి యుండెను. పాపమా శిష్యుడు నిస్తబ్ధుడై ఖిన్నుడై బొమ్మవోలె నిల బడిపోయెను. అంత మహాశయుండా పురుగుల సమీపించి "ఇక మీరు మరల మీస్థానము నాక్రమించుకొనుడు. మిమ్మెవ్వరును బాధపెట్ట"రని మరల నవి పుట్టపెట్టుకొనుటకు సాయపడెను. కొంతకాలమునకు స్తంభములు కూలిపోయెను. కాని యా చెదలుపురుగులను బాధించుట కాత డొప్పుకొనలేదు.

మహాశయునికి బాల్యమునుండియు గోవనిన నతిశయభక్తి. ఆవు లం దాతడు జగన్మాతస్వరూప మెక్కుడుగ దర్శించువాడు. తరచు వాని పాదధూళి శిరమునం దుంచుకొనును. ఒక దినమున నాతని వద్ద

చెరకుగడ ముక్క యొండఁగఁ జూచి దాని యాకులఁ దినవలెనని గోవొకటి ప్రయత్నించుచుండెను. అంత మహాశయు లా చెఱకు ముక్కను చిన్న ముక్కలుగ గోసి గోవునకు ప్రేమతో బెట్టెను. తరువాత దాని పాదములకు సాష్టాంగపడి విసర నారంభించెను. విసరుచుండగ నాతని మనమున భక్తిభావముదయించి యాతడుస్మృతి రహితుడై పడిపోయెను.

మహాశయుండు శక్త్యుపాసకుడు. శక్తియుపాసనయందు బ్రహ్మమును తల్లి రూపమున బూజించును. ఆయనయు శ్రీరామకృష్ణుని వలెనే "త్రోవలెన్నియైనను గమ్యస్థాన మొక్కటియే. ఇందు జాతి మతభేదములు ప్రయోజనపడవు. ఏయొక్క మతమును నమ్మి యందు నిష్ఠగలిగియున్నను ఈశ్వరుడు తప్పక కటాక్షించును" అని నమ్మెను. అతనికి జాతిమతములయం దెట్టి భేదబుద్ధియు లేకుండెను. శైవులయినను వైష్ణవులైనను * బౌలులైనను, కార్తభాజులైనను ఆత డొకే రీతిని గౌరవించెను. అతనికి మసల్మానులయందును క్రైస్తవులయందును హిందువులయందును సమాన గౌరవ ముండెను. మసీదును జూచినపుడెల్ల నాతఁడు చేతుల జోడించువాడు. అదే రీతిగ క్రైస్తవ దేవాలయముల గాంచినప్పుడును "జీససునకు జయముగు గాక" యనుచు నమస్కరించువాడు.

భక్తిసాధనలగూర్చి యిట్లనువాడు. "ఫలవృక్షము క్రిందనుండు కాపరివలె బుద్ధి యెల్లప్పుడును మెలకువగ నుండవలెను. పండ్లు పక్వమగుట ఈశ్వరుని కృపాధీనము. సాధకుఁడు తన సాధనలయొక్క ఫలము ననుభవించుట యెల్ల నాతని కటాక్షమే. కొందరి యెడల నెట్టి

* వీరిద్దరు చైతన్యమతమునందు రెండు విధములవారు.

పురుషప్రయత్నము లేకయే యాకరుణ ప్రసరించును. ఈ ప్రకారము వారు నిద్రించుచుండ కృపాసింధువగు భగవంతుఁడు వారిపై నమృతమును వర్షించెనా యనునట్లు అందరకును ఆశ్చర్యకరముగ నుండును. అట్టి వారలు ఎట్టి సాధనలను అభ్యసించవలసిన యవసరమే యుండదు. వారలు * కృపాసిద్ధులనబడుదురు. భగవంతుని యనుగ్రహములేక యాతని నెవ్వరును జూడజాలరు. పరమేశ్వరుడు భక్తుల పాలిటి కల్పతరువు. తన్ను కోరిన దెల్లయు నొసఁగును. కాని మనుజుడు బుద్ధిగలిగి మరల సంసారసాగరమున బడద్రోయు కోర్కెల గోర రాదు. అతని చరణకమలములయందచంచలభక్తియు ఆత్మజ్ఞానమును ఇచ్చునట్లే కోరవలెను. అట్లు కోరినయెడల నాతఁడు ప్రాపంచిక విషయబంధవిముక్తుఁ జేయుచు ఆతని కృపకు తప్పక పాత్రుడగును. ప్రాపంచికేచ్ఛలఁ దవిలినవో సుఖ మెన్నడును ఉండజాలదు. ఏభక్తుడు సదా యీశ్వరధ్యానమందే మునిగి యాతని భక్తగణమును భక్తితో బూజించుచు పవలు రాత్రి యనక నా దేవదేవుని నామస్మరణముఁ జేయుచుండునో యాతఁడు మాత్రమీ దుఃఖభూయిష్ఠమగు నీ ప్రపంచమున కతీతు డగును."

మరియు అణిమాద్యష్టసిద్ధులనుగూర్చి ఇట్లనువాడు. "హృదయము పవిత్రమై ఆధ్యాత్మిక పథమున నుచ్చైఃస్థితిని పొందుకొలదని కొన్ని సూక్ష్మతరములగు విషయేచ్ఛలు మనస్సు

* భగవంతుని యవ్యాజకృపాకటాక్షమునకు పాత్రులైనవారు కృపాసిద్ధులు. ఇట్టి యనేకులు అవతారమూర్తుల చరిత్రలయందు కానవచ్చుదురు. ఉదాహరణరూపమున చైతన్య మహాప్రభుని కృపకు పాత్రులైన బందిపోటుదొంగలును హంతకులును నగు జగన్నాథుఁడు మాధవుఁడనను సోదరులు ఇచ్చట పేర్కొనదగినవారు.

నాకర్షింపజొచ్చును. అట్టి వానికి కొన్ని యలౌకికశక్తులు వచ్చి అతడు వానిని ఉపయోగించుకొలది అవి అతనిని అధఃపతితుని జేయ జూచును. నిర్మలాత్మునికి వస్తువితర్క మనవసరము. స్వచ్ఛమగు స్ఫటికమున నెల్ల వస్తువులును ప్రతిబింబితములగు నట్లాతని నిర్మల హృదయమున గూడ ప్రతి లౌకిక విషయమును సంపూర్ణముగ గోచరమగును. కాని ఇట్టి మహిమ లాతని మనము నాకర్షించినచో నాతడు తన యాదర్శజీవితమునుండి యధఃపతితు డగును."

నాగమహాశయుని సమక్షమున నాతని భక్తులకట్టి సందేహము ఉదయించినను వారాతని నడుగువారుకారు. మహాశయుడే యాసంగతిని ప్రసంగవశమున నెత్తి వారికి తృప్తియగునట్లు సందియములందీర్చువాడు. ముఖమును జూచి ఎట్టి వానియొక్కయు స్వభావమును తెలిసికొనగల శక్తి గలవాడు. ఆతడొకని పక్వభావమునుగూర్చి చెప్పిన వాక్యము లెన్నడును తప్పిపోలేదు. ఒక్కొకసారి భార్యతో నెవరో యొకరు తమ యింటి కతిథులుగ రాబోవుచున్నారనియుం దాను అంగడికేగి వస్తువులను కొనివత్తుననియు జెప్పి యాత డంగడికి పోయి మరలి వచ్చునప్పటికా చెప్పినవారు తప్పక వచ్చియుండువారు.

ఒక దినమున నశ్వినీకుమార చక్రవర్తి యను నాతడు శరచ్చంద్ర చక్రవర్తితో మహాశయుని చూచుటకు దియోబాగునకు బయలుదేరెను. అశ్వినికి శూలనొప్పి ప్రతి సాయంత్రమును వచ్చి రాత్రియంతయు నాతని మూర్ఛాబద్ధునివలె పడవేయుచుండెను. ఆ బయలుదేరిననాడు వారు దియోబాగును సాయంత్రములోపల చేరలేకపోయిరి. అందువలన ప్రతి నిముషమును ఆ బాధ ఎప్పుడు వచ్చునో యని భయపడుచు పయనము సాగించుచుండిరి. కాని భగవానుని దయవలన నేకష్టమును లేక దియోబాగును జేరిరి. అశ్విని వేళ తప్పుటచే నిక నారాత్రి గూడ

నే బాధయు కలుగునట్లు తోచదని చెప్పగ శరత్చంద్రుడు సంతసించెను. అయినను మూపములు నిద్రాహారములు లేక బాధపడుచుండిన యాతడు ఆరాత్రి నొప్పి తగ్గియుండుటచే తృప్తిగ భుజించి హాయిగ నిద్రించెను. ఆట్లు వారిద్దరును సుఖముగ మూడుదినములుండిరి. తరువాత యశ్విని యీ సంగతి జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల "నేను నా పూర్వ దుష్కర్మమువలన ననుభవించుచుండిన బాధయెల్ల నొక్కసారి యా మహాత్ముని దర్శనము సేయగనే యుపశమించెను. అప్పటినుండియైన నాయననే పట్టుకొని యాయన దయకై వేచియుండినచో నీ పాటికి నా స్వభావ మెంతయో మారి నా యదృష్టము ఫలింప ముక్తిమార్గమున నెంతయో దూరముపోయియుందును గదా" యని విచారించువాడు.

ఇంకొకతరి నొక బ్రాహ్మణ బాలునికి స్ఫోటకము వచ్చెను. విశంతునను నాతని తల్లి యా బాలుని మొదల జీవితాశ గన్పట్టకపోవుటచే మృత్యుశయ్య నలంకరింపనున్న యా చిరుతని మహాశయుని యింటి గుమ్మము ముందు బడవైచెను. కాని భగవదనుగ్రహమువలన నా బాలుడు రోగవిముక్తు డయ్యెను. తరువాత సురేశుడు "మహాశయా! యా బాలు డెట్లు జీవించెనని" యడుగ "సురేశా! బాలుడు జీవించినమాట మాత్రము నిజము, కాని ఎట్లు బ్రతికెనో యది నేనెరుగ" ననెను.

వేసవికాలమున నొకనాడు మహాశయుని గృహమున కొకింత ఉత్తరముననున్న పూరి ఇంటికి నిప్పంటుకొనెను. కొలది సేపటిలో నా యగ్నికి వాయువు తోడై యగ్నిని సహస్రముఖముల వ్యాపింప జేసెను. చూచుచుండగనే భయంకరముగ జ్వాలయయ్యెను. మహాశయుని ఇల్లు ఈ పూరి ఇంటికి ముప్పది బారలదూరమున నుండెను. అగ్నికణములన్ని వైపుల కురియుచుండెను. చుట్టుప్రక్కల ప్రదేశమంతయు కోలాహలమయ్యెను. ప్రతివ్యక్తియు మంటల నార్పుటకు

ప్రయత్నించుచుండెను. మహాశయుని కిది యేమియు దెలియక ముకులితహస్తుడై యావంతు కెదురుగ గూర్చుండెను. మహాశయుని భార్య తమ గృహముగూడ నా యగ్ని కాహుతి యగునను భయమున కంపితదేహయై యింట నున్న సొద్దులు మొదలగునవి యీవలకు దీయుచుండెను. మహాశయు డిది చూచి "మోసపు మూర్ఖురాలా! యింకను ఎట్టి యజ్ఞానమున నుంటివి? ఈ తుచ్ఛములగు వస్తువులతో నేమిచేయుదువు? పరబ్రహ్మమూర్తి యీ రూపమున నీ యింటి కెంతయో దగ్గరకు వచ్చినాడు, ఆతనికి పూజల నర్పించి ప్రార్థించుటకు బదులుగ నీ స్వల్పములును నీచములునగు వస్తువులకై దేవులాడుచుంటివా?" యని "జయ్ పరమేశ్వరా! జయ్ సచ్చిదానందా!" యని కేకలిడుచు నృత్యము సేయుచు "మనుష్యుని రక్షించుటకై భగవంతు డున్నప్పుడు భయపడుటెందుకు? ఆయనకు రక్షింప కోరిక లేకున్నచో, నా వ్యక్తిని రక్షించుటకు భూమియందెట్టి శక్తియును లే" దనెను. తరవాత నా పూరియింటిని భస్మమొనర్చి యగ్ని చల్లారెను. మహాశయుని గృహము చెక్కుచెదర కట్లే యుండెను.

*అర్ధోదయము వచ్చిన సంవత్సరమున నా పవిత్రదినమునకు మూడు నాల్గుదినములకు ముందే మహాశయుడు స్వస్థానమునకు మరలి వచ్చెను. అందువలన దీనదయాళు మిక్కిలి కోపము చెంది "నౌరీ! నీ కెట్టి మతమో తెలియకున్నది. కడు వింతగ నున్నది. ఇది యేనా నీ మతసారము. వివిధదేశములనుండి వచ్చిన మనుజు లెల్లన నా గంగాతోయముల స్నానము చేసిన చాలు నని వేచియుండు సమయమున పడిపోయినట్లు పరమపవిత్ర మగు గంగానదిని వదలి

*ఇది ప్రతి ఏబది సంవత్సరముల కొకమారు వచ్చుచుండును. ఇది పూర్వాచార పరాయణుల కతి పవిత్రదినము.

యిప్పటికి వచ్చితివా? చేతికి దొరికిన రత్నము బోగొట్టుకొని గాజుపెంకులకై వెదకు నభాగ్యురాలివి నీవు? ఇప్పుడైనను తరుణము మించిపోలేదు. నన్ను కలకత్తాకు గొనిపొమ్మ"ని తీక్ష్ణముగ బలికెను. అంత మహాశయుండు "నాయనా! గంగామతల్లిపై నిజముగ భక్తియున్నయెడల ఆమెయే యీతని గృహమున కేతెంచి పావనము చేయును. అత డామెకొరకై నేనొక చోటికిం బోనేల?" యనెను. ఇంతలో పవిత్రదిన మేతెంచెను. శ్రీమతి హరకామిని, కైలాసబోసు ఇంకను మరికొందరు నాగమహాశయుని భక్తులాదినమున దియోబాగునకు వచ్చిరి. సరిగ నా పవిత్రసమయమున మహాశయుని ఇంటి పెరటియందు ఆగ్నేయదిక్కున భూమి పగిలి మర్మరధ్వనులతో నీరుబుకుచు పెరటిని నింపివేయుచుండుటను జూచి హరకామిని నిశ్చేష్ట యయ్యెను. మహాశయుడప్పుడు గదిలో నుండెను. ఈ ధ్వని విని యీవలికి వచ్చి యా ప్రవాహమునకు సాష్టాంగపడి "యమ్మా! గంగాభవానీ! జగద్వ్యాపినీ జయము! పాపహారిణీ జయము" అని యతిగౌరవమున కొంత యుదకమును శిరముపై చల్లుకొని మరల సాష్టాంగపడెను. తరువాత నింట నున్నవా రందరును ఆ నీటియందు స్నానముల నాచరించిరి. ఈ వార్త వ్యాపింపగనే జనులు తండోపతండములుగ వచ్చి యచ్చట స్నానమాచరించిరి. ఇక మహాశయుని గృహావరణమంతయు "గంగాభవానికి జయము"ను వాక్యములతో ప్రతిధ్వనించెను. అంత నొక ఘంటకు ప్రవాహమాగి నీరు తగ్గుటకారంభించెను ఈ యుదంత మంతయు సత్యమని సాక్ష్యమొసగువారు మహాశయుని కాలమునాటివారిప్పటికి యున్నారు. ఆ పవిత్రతోయముల ముట్టుటవలన ఎన్ని సంవత్సరములనుండియో బాధపడుచున్న హరకామిని రోగవిముక్తురాలయ్యెను. ఈ విషయ మెన్నడును మహా

శయుం డెవరితోడను జెప్పలేదు. దానిగూర్చి ప్రశ్నించినప్పుడు కూడ "నయ్యో! కొలదియున్న గొప్పచేయుట మానవస్వభావము గదా" యనును. ఈ సంగతిని వివేకానందులతో జెప్పగా నాతడు "అట్టి మహాత్ముల సంకల్పశక్తి కసాధ్య మేదియు లేదు. వారి సంకల్పశక్తిచే ఎట్టివారును సంసారబంధములు తొలగి ముక్తులు కాగలరన నిక వారి కసాధ్య మేమియుండును?" అనెను.

మహాశయునికి, తనజీవితమంతటి ప్రతి కార్యమందును, రామకృష్ణుని పవిత్రసాన్నిధ్యము తెలియుచునే యుండెను. ఒకతరి మహాశయుడు నిద్రించుచుండ నొక మార్జాల మాతనిముఖముపై బడి ఎడమకంటిని గోకెను. అది కొంచెము గాయమై బాధ పెట్టసాగెను. కాని దానికై లెక్కసేయక "పూర్వజన్మకృతదుష్కర్మల కిట్లు రామకృష్ణదేవుడు శిక్ష విధించుచున్నాడు. ఇది కూడ తప్పక నాతని కృపయే" యని యూరకుండెను. గాయముకూడ నెక్కువ చికిత్స చేయకయే నిమ్మళించెను. ఆతనికి ప్రతివస్తువునుగూడ రామకృష్ణ స్వరూపమే. జగ మంతయు నాతనికి రామకృష్ణతేజోమయముగం దోచెను.

కలకత్తాలో నుండగా నొకప్పుడు రెండుచేతులలోను ఒక విధమగు బాధ యుదయించి మిక్కిలి కష్ట పెట్టెను. ఆబాధ మూలమున నాతడు చేతులను కదల్పలేక నెల్లప్పుడును ముడుచుకొనియుండవలసి వచ్చెను. తా నెల్లప్పుడును ముకుళితహస్తుడై యుండునట్లు గుణపాఠమును నేర్పుటకై శ్రీగురుదేవు డట్లు విధించెనని యాతడు చెప్పవాడు.

శూలనొప్పితో నాతడు బాధపడుచున్నప్పుడు, "జయము రామకృష్ణా! ఈ యస్థిపంజరమును సంపూర్ణముగ నీ పాలుచేయకుండుట

కిది తగినశిక్షయే. ఇది యెల్ల నీ కృపాకటాక్షము. తండ్రీ! ఈ విధముగ నైనను సదా నిన్నే స్మరింపజేసి నీదయకు పాత్రునిగ జేయుచున్నావు. శ్రీ రామకృష్ణుని స్మరింపజేయుటచే నీ బాధగూడ ధన్యతమమైనది. ఓ దేవా! నీకు జయము. నీ కృపకు జయ మగుగాత! ఇది నీ కృపాతేజఃప్రసారమే! తప్పక నీతేజఃప్రసారమే! నీ దయకుఁ బాత్రుడగుట తప్ప మనుజునకు వేరొండు ముక్తిమార్గము లేద"ని స్తుతించువాఁడు.

మహాశయులు గురుపీఠము నెన్నడును ఎక్కలేదు. ఎవరైనను నేదేని బోధింపుమనిగోరిన "ఒకరికి బోధించుట కెవ్వరికిని యధికారము లేదు. కర్మ పరిపక్వము కాగానే, శ్రీ రామకృష్ణునిదయ ప్రసరింప జ్ఞానచక్షువు తనంత నదియే యున్మీలనమగును. ఆ కంటితో నెచ్చట జూచినను సర్వము శ్రీ కృష్ణమయముగఁ దోచును. అప్పుడు ప్రతివస్తువును వింతరూపముతో గన్పట్టు" ననును.

కాని భక్తు లెన్నడేని యధైర్యపడియున్నయెడల "మీరు శ్రీ రామకృష్ణునియెడ విశ్వాస ముంచినప్పుడే మీ కిది తుదిజన్మయని నమ్ముడు. ఎవ్వరు హృదయపూర్వకముగ నా దేవాది దేవుని నమ్మునో ఆతడు ధర్మపథమునుండి తొలంగక చతుర్విధ పురుషార్థములను పొందును," అనుచు వారలకు ధైర్యము చెప్పువాడు.

వంగదేశమునందు ప్రసిద్ధ నాటకాచార్యుడగు గిరీశ చంద్ర ఘోషు నాగమహాశయుని గూర్చి అర్థగాంభీర్యముగ నిట్లనువాడు. "మహామాయ నరేంద్ర (వివేకానంద) నాగమహాశయులఁ దనవలయందు పడవేసికొనుటకు ప్రయత్నించి గొప్ప కష్టమునకు లోనయ్యెను. నరేంద్రుని వశపఱచుకొనుటకు ప్రయత్నింపగా నాతడు పెద్దయై

పెద్దరై యామె కలత్రాల్లు చాలనంత పెద్దయగుటచే విఫలమనోరథురాలై తన యుద్యమమును విరమించెను. ఇక మహాశయుని బంధించుటలో నాతడంతకంతకు సూక్ష్మమై సూక్ష్మమై యామెత్రాళ్ళనుండి తప్పించుకొనిపోవుచు నామెను భంగపఱచెను."

## భక్తవర్గము

నాగమహాశయుడు గురువుగ వర్తించుట కెన్నడును ఒప్పుకొని యుండలేదు. అతడెవరికిని యుపదేశము చేయలేదు. తాను శాస్త్రవిధి ప్రకారమే నడుచుకొనుచు నితరు లావిధిని మీఱిన దుఃఖించువాడు. "శూద్రుడుపదేశముచేయుట కర్హుడు కాడ"ను శాస్త్రప్రమాణమును తిరస్కరింప నొల్లడు. కాని యాతని కటాక్షమహిమచే అనేకుల హృదయములయందు జ్ఞానాగ్ని రగిలెను. ఆతని పవిత్ర సంస్పర్శము అధఃపతితుల నెందఱనో కాచి రక్షించెను. అట్లుండినను తన్నెవరైన గురువుగ నిర్దేశించిన మనసున చాల బాధపడువాడు "నేను అధమజాతి శూద్రుడను. నేనేమి యెఱుగుదును? మీరందఱిచ్చటికివచ్చి మీ పాదధూళిచే నన్ను ధన్యునిజేయుచున్నారు. శ్రీరామకృష్ణ గురువర్యుని దయచే మిమ్మందరిని చూడగలభాగ్యము లభించినందుల కెంతయు ధన్యచరిత్రుడ నైతి" ననును.

బ్రాహ్మణ భక్తు డొకడాతని నుపదేశింపు మని మిక్కిలి బలవంతపెట్టెను. అందుల కాత"డయ్యా! నీవు బ్రాహ్మణుడవు. అందును విద్యాధికుడవు. అట్టి నీవు శాస్త్రవిధుల నల్లంఘించుట తప్పు. శాస్త్రవిధులను తిరస్కరించినందుననే మన మిట్టి దుర్గతి పాలైతి మని తెలియుము. నేను గృహస్థుడను. గృహస్థాశ్రమధర్మమును పాలించుటయే నా ధర్మము. అదియే నా గురువాక్యము. ఆ యాజ్ఞను ఏమాత్రమును

జలదాటుటకు నా కధికారములేదు" అనెను. కాని యా భక్తుడు హతాశుడై చాలదీనవదనుడగుటను జూచి "నాయనా! అధైర్యపడకుము. పరమశివుండే నీ కుపదేశింపగలవాడు" అని ఆశీర్వదించెను. తరువాత కొంతకాలమున కాతడు వివేకానందునివలన నుపదేశ మందెనని విని సంతసించి యిట్లనెను. "ప్రస్తుతకాలమున శ్రీ గురుదేవుని సన్యాసశిష్యులే యుపదేశము చేయుట కర్హులు. వారే సరియైన గురువులు వారివద్ద నుపదేశమందినవారలు ధన్యులు. వారలు తప్పక భగవంతుని యనుగ్రహమునకు పాత్రు లగుదురు."

నాగమహాశయునివద్ద నుపదేశమంది యాతనికి శిష్యులై మెలగుచుండినవారి లెక్కయైనను లేకపోయినను ఆతని భక్తవర్గము లెక్కకు మిక్కుటమై యుండెను ఆతడు వారల ప్రేమించి వారలెన్నడును ధర్మపథము నతివర్తించకుండునట్లు జాగ్రతతో చూచుచుండువాడు. భక్తుడు దూరముననున్నను దగ్గరనున్నను తన సముఖమున నున్నను లేకపోయినను ఎల్లప్పుడాతని ముక్తిపథగమనాభివృద్ధికై ప్రార్థనల సల్పువాడు. ఒకసారి యాతని భక్తుడొక డాతని జూడవలెనని మిక్కిలి యభిలాషజెంది దియోభోగునకు రానుద్యమించెను. ఆతడు ఢక్కా కళాశాలలో చదువుకొనుచుండెను. ఆతడు ఢక్కానుండి నారాయణగంజికి వచ్చుసరికి సాయంత్రమయ్యెను. అది వర్షాకాలమగుటచే రోడ్లు పొలములు మొదలగునవియున్నియు నీటితో నిండియుండెను. నారాయణగంజినుండి దియోభోగునకుం బోవు మార్గము శ్రీ శ్రీ లక్ష్మీనారాయణజీ దేవాలయము ప్రక్కనుండి పోవును. ఆనాడు ఆకాశము మేఘావృతమగుట చీకటి మిక్కిలి దట్టమయ్యెను. వాన జోరున ధారాపాతముగ వర్షించుచుండెను. కష్టములలో కష్టములను నట్లాసమయమున నచ్చట నొక నావకూడ దొరకదయ్యెను. ఇక వేరు

మార్గము గానక నా నీటిని ఈది యావలికి జేరుటకు నిశ్చయించెను. నాగమహాశయుని మనసార ధ్యానించి యా గంభీర ప్రవాహమున నురికెను. రాత్రి తొమ్మిదిగంట లయ్యెను. అప్పటికా భక్తుడు చలిచే దేహమంతయు మొద్దుబారి మహాశయుని యింటి కుత్తరమున తేలుచు వచ్చెను. అప్పటి కీతని యుద్యమము తెలిసినవానివలె మహాశయు డతనికై గట్టున వేచియుండెను. ఈతని జూడగనే "అయ్యో! ఎంత సాహసమున కొడిగట్టితివి! ఇప్పుడీ పంటభూములన్నియు పాములతో నిండియున్నవి. ఇట్టి నిశీథ మధ్యమున నాకాశము చిల్లులవకునట్లు వర్షించుచుండ నిట్టి యసాధారణ కార్యమును చేయ సమకట్టుట పాడియా? ఎట్టి పని యొనర్చితి"వని మందలించుచుండ, నాతని మందలింపులకు త్తరువొసంగక నాతనివెంట నాతని ఇంటిలోనికిం బోయెను. మహాశయుని భార్య కట్టుకొనుట కొక పొడి వస్త్రమిచ్చి యట్టి సాహసకృత్య మొనర్చినందుల కామె గూడ మందలించెను. అంత నా భక్తు డేడ్చుచు "మహాశయా! మిమ్ము జూడకుండ నుండుట దుర్భరమయ్యెను" అనెను. ఎట్టకేలకు శరత్కుమారి వంట చేయుటకు లోనికేగెను. కాని వండుటకు యెండుపుల్లలు లేకపోయెను. ఇది మహాశయునికి దెలిసి భక్తుడెంత వలదని వేడుకొనినను మానక నింటి వాసమొకదానిని తెగగొట్టి భార్యకిచ్చి "ఏమి? నాకొరకై ప్రాణములను గూడ లెక్కసేయక యిట్టి రాత్రియందు పాములతో నిండియున్న పొలములలో బడి యీదివచ్చిన యీతనికై ఈ మాత్రము చేయ వలదా? ఇట్టి వానికెంత కొలది సేవ యొనర్చినను ధన్యులే నగుదు" ననెను. భక్తుడుగూడ తానా రాత్రి కష్టములనుండి యీవలబడి రక్షింపబడుటకు మహాశయుని కృపయే కారణ మనుకొనెను. ఈవిషయమును

## నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

సోదరి నివేదిత తన "The Master as I saw Him" యను గ్రంథమున నతిశయముగ వర్ణించియున్నది.

ఇంకొక సమయమున నాయువకుడే యాత్మహత్య గావించుకొన సంసిద్ధుడైయుండ మహాశయుడు అతి విచిత్రముగ రక్షించెను. అప్పడా యువకుడు కలకత్తాలోని మెట్రొపాలిటన్ కళాశాలలో పట్ట పరీక్షకు జదువుచుండెను ఆ పరీక్షకు జదువు కాలములో నొక నాడాతడు వెన్నెలలో డాబాపై పచారుచేయుచుండెను. చుట్టు ప్రక్కలనంతయు శాంతిప్రదముగ నున్నను ఆతని మనసు విచారగ్రస్తమై క్రుంగియుండెను. నాగమహాశయుని చాలకాలమునుండి చూడకుండుటయే ఇందులకు కారణము. అది యాతని నెంతయో బాధింప నొడగెను. ఆతని యాత్మ యింకను జ్ఞానోద్దీపితము కాలేదు. గురువర్యుడగు మహాశయుని దర్శనరహితమగు తనజన్మ దుర్భరమయ్యెను. శ్రీరామకృష్ణుని ఇతర శిష్యుల సాన్నిధ్యమున గొంత శాంతిబొందుద మన్న వా రెవ్వరీతని నప్పటికెరుగరు. నాగమహాశయుడు ప్రతి సంవత్సరము వలెనే యా సంవత్సరము గూడ దుర్గాపూజార్థమై సరకుల గొనుటకు కలకత్తాకు వచ్చునని యెరుగును. అయినను ఆతడు అంతవరకు వేచియుండలేక పోయెను. "మహాశయునివంటి మహాపురుషుడు కటాక్షించియు ఆనందమయ బ్రహ్మస్వరూపమును గాంచజాలని నా బ్రతుకికెందులకు"నని తలపోసి యాతడు డాబానుండి క్రిందికిదుమికి చనిపోవుటకు నిశ్చయించుకొనెను. కాని యాతని వాక్యములు క్రియారూపముగ పరిణమించునంతలో నా నిశీథ మధ్యమున నొకవాణి యిట్లు వినబడెను. "రేపుదయమున నీవు మహాశయుని జూడగలవు". అప్పుడచ్చట నెవ్వరును లేకున్నను, ఈ మాటలెట్లు విననయ్యెనా యని యాతడు చకితుడయ్యెను. వెంటనే లోనికి బోయి పరుండెను.

మరునాడు ఆ యువకుడు నిద్రనుండి లేచునప్పటి కెవరో తలుపుతట్టుచు పిలుచుచుండిరి. అంత నాతురతతో లేచి తలుపుదీయు సరికి మహాశయుడు చేతనొక సంచితో ప్రత్యక్షమయ్యెను. ఈతనిఁ జూడగనే మహాశయుడు "ఎట్టి సాహసమున కొడిగట్టితివి. నాకెట్టి యాందోళనమును కలిగించి యిప్పటికి వచ్చునట్లు చేసితివి. శ్రీ రామకృష్ణ సామ్రాజ్యమున ప్రవేశించినతరువాత కూడ నెందులకిట్లు నిరాశఁ జెందెదవు. తొందరపడకుము. ఆత్మహత్య మహాపాపము," అని మందలించెను. మరియు "ఇంతవరకును నీవు లోతునకుబోక, ఒడ్డునకు దగ్గరనే యుంటివి. ఇప్పుడిప్పుడు లోతునకు బోవుచున్నా"వనెను. తరువాత నాతని బేలూరుమఠమునందున్న శ్రీరామకృష్ణ శిష్యుల దరికిఁ గొనిపోయి "అయ్యా! యీ యువకుడు మిక్కిలి యశాంతిగ నున్నాడు. దయయుంచి ఈతడు శ్రీ గురుదేవుని కృపకు బాత్రుఁడగునట్లాశీర్వదింపు" డనెను.

మహాశయు డొకమారు తన దర్శనమునకై తరచుగ వచ్చుచుండిన శిష్యులతో నిట్లనెను:—"నాయనలారా! మీరు నాకు ప్రాణాధికులు. నావలన మీకెట్టి యుపకారము గలుగవలసి యున్నను నా ప్రాణములనైన నర్పింప సంసిద్ధుఁడనై యున్నాను. అంతకు దక్క నీ యస్థిపంజరమునకు వేరు ప్రయోజనమేమి యుండును."

మహాశయుని భక్తవర్గములో మొట్టమొదట నెన్నదగినది యాయనసహధర్మిణియైన శరత్కుమారి. మహాశయునియింట ఆతిథ్యము గొన్న ప్రతివారు, ఒక దేవకన్యకవలె నామె యింటి పనులన్నియు జూచుకొనుచు, భర్తను, అతిథులనెట్లు సేవించుచుండెనో, ఎఱిగి యుండిరి. ఉదయమున నందరికంటె ముందుగ లేచి ప్రాతః కాలకృ

త్యముల దీర్చి భగవద్ధ్యానమునకు గూరుచుండును. తన భర్తయు నతిథులును భుజించువరకు భోజనముచేయదు. ఆమె యింటిపనులన్నియు స్వయముగనే చేసికొనును గాని తుదకు తన సోదరియగు హరకామినికి గూడ తోడుపడ నియ్యకొనదు. ఆమెకు తనభర్త దక్క నితర దైవమేదియు లేదు. నాగమహాశయుని యందే సదా ధ్యానముంచి మనసార పూజించును. ఒకసారి *మహాష్టమి దినమున భర్తకు పాదపూజ చేయ దలపెట్టెను. గాని యందుల కాత డియ్యకొనడయ్యెను. "పూజకు అర్హురాలగు నామె నుండి పూజ నెట్లు గ్రహింపనొప్పును?" అనెను. అయిన నంతటితో నామె యధైర్యపడక సమయము కొరకు వేచి యుండి తుదకొకపరి మహాశయులొకమూల నన్యమనస్కులై యుండగ నా తరుణము గ్రహించి తన కోర్కె నెరవేర్చుకొనెను. తరువాత నామె యా పూల నొక బంగరు పాత్రయందిమిడ్చి తన మెడలో కట్టుకొనెను.

ఆమె యిప్పటికిని జీవించియున్నది. ఆమె సాన్నిధ్యము మహాశయుని శిష్యవర్గమున కత్యంత ప్రోత్సాహజనకము. ఆ నారీశిరోమణి పవిత్రతయొక్క యాదర్శ స్వరూపము. ఆయమ హృదయకోమలత్వము, శాంతి, ఓర్పు, మానవ సేవయందలి స్వార్థత్యాగము అన్నిటికన్న నామె పవిత్రతయు, తపశ్చరణము చూపరుల నాశ్చర్యమగ్నులఁజేసి యామెయెడ భక్తిగౌరవముల గలుగజేయును.

నాగమహాశయుడు జీవించియున్నంతకాలమును భక్తులందరును ప్రతిశనివారము దియోభాగునకు బోవువారు. శరత్కుమారి యందరకును ఫలాహారాదికములను సిద్ధముచేసెడిది. మహాశయుడు తనయింట ఎన్నడును వర్ణాశ్రమధర్మముల నతిక్రమించియుండలేదు. బ్రాహ్మ

* అక్టోబరు నెలలోని నవరాత్రులలోని యెనిమిదవ దినము.

ణులు భుజించునప్పు డాతడు బద్ధాంజలియై గృహప్రాంగణమున నొక పార్శ్వమున నిలబడియుండును. శరత్కుమారి దగ్గరనుండి మిక్కిలి భక్తిశ్రద్ధలతో భోజనమిడును. మహాశయుని గృహమున కరుదెంచినవా రెవ్వరు నొకసాధువగన్యాని యాశ్రమమునకు వచ్చినట్లు తలంపక తమ జననీజనకులకడకు వచ్చినట్లే తలచువారు. నాగమహాశయుండు పరలోకగతు డైనతరువాత పూజ్యపాదులగు శ్రీ వివేకానందస్వామి ప్రతివత్సరమును వచ్చునట్లే దియోబాగునకు వచ్చెను. నాగమహాశయుడు, ఇట్లు స్వామి ప్రతివత్సరమును తప్పక వచ్చుచుండుననని. తెలియుటచే చనిపోవునపుడు ముందాతని స్నానాదికములకు తగునేర్పాటులను గావించియుండెను. స్వామి పూర్వమువలెనే మహాశయుని గృహమునకుబోయి, శౌచస్నానాహారాదికముల దేశాచారమునకు దగునీతి నిర్వర్తించుకొని తన ప్రతిజ్ఞను కాపాడుకొనెను. స్వామి యటనొక దినముండి ఢక్కాకు బోయెను. పోవునప్పుడు శరత్కుమారి యొక వస్త్రమొసంగెను. స్వామియద్దాని నసాక్షిణముగా ధరించి మహాశయుని గుణగానమొనర్చుచు దియోబాగునుండి వెడలిపోయెను. ఢక్కాకు ప్రచారక కార్యముపై బోవుటకు బూర్వము మహాశయుని భక్తుడగు నొకనితో "అచ్చటికేగి యుపన్యాస మిచ్చుటకు నా కిష్టములేదు. మహాశయుని పాదస్పర్శచే పవిత్రమైన యచ్చోటున నే నేమి చెప్పుదు" ననెను. అంత నాభక్తుడు "అయ్యా! ఆయన ఎప్పుడును మౌనముగనే యుండువాడు" అనెను. అందులకు స్వామి "అతడు మాటాడవలసిన యవసరమే లేదు. అట్టి మహాపురుషుల చింతాతరంగములు దేశముయొక్క చింతాస్రోతముయొక్క గతిని మార్చివేయగలవు."

మహాశయుని చిన్న మరదలగు హరకామినియు నాతనినేయిష్ట దైవముగ బూజించుచు మనసార నాతని పదపద్మములనే ధ్యానించు

చుండెను. ఆమె హృదయస్థమగు భక్తియు నిరాడంబర జీవనమును మిక్కిలి కొనియాడదగినవి. మహాశయుడుగూడ నామెయందు పుత్రికా వాత్సల్యముండి యామె ఇంట జరుగు పూజామహోత్సవ సందర్భ ములయందెల్ల యామె ఇంటికి బోవువాడు. మహాశయుడులేని పూజ యసంపూర్ణమని యామె విశ్వాసము.

ప్రాపంచికవిషయముల నామెకు నేవిధమయిన సంబంధమును లేదు. రోగముననను శోకముననను, సుఖముననను దుఃఖముననను, మరెట్టి పరిస్థితులయందును అప్రచలితయై యుండెడిది. మహాశయుని భక్తులనందరి నొక్క కుటుంబములోనివారిగ నెంచి మిక్కిలి యాదరించునది.

మహాశయుని యత్తగారు ఒక గొప్ప భక్తురాలు. ఒకసారి యామె కలకత్తాకు వచ్చి కుమార్తెతోడను అల్లునితోను కుమార్తెలింట బస చేసెను. అచ్చట ప్రతిదినమును గంగాస్నానమాచరించి యచ్చటి మట్టితో శివలింగమును జేసి పూజించునది. ఒక దినమున నామెయట్లు పూజించుచుండ నాలింగము ఊర్ధ్వభాగమున బీటవారెను. అదియామె జూచి మిక్కిలి విచారించి యా దినమంతయు నా నదీతీరమున నేడ్చు చుండెను. చీకటి పడినను యింటికామె రాకపోవుటచే మహాశయు డామెకై వెదకుచు గంగాతీరమున నేడ్చుచున్న యామెను జూచెను. ఆమె యాతనితో జరిగినదంతయుఁ జెప్పగా నాతడామెను "నీకెట్టి చెడుగును సంభవింప"దని యోదార్చెను. తరువాత నామె యాతనితో నింటికేగి విచారభారమగు మనముతో నిద్రింప నా నిద్దురలో శివుడు ప్రత్యక్షమై "బిడ్డా! నీభక్తికి సంతసించితిని. ఇకమీద నీవు నావిగ్రహమునకు పూజచేయుట యనవసరము" అనెను. ఆమె ఆవిషయమును మరు నాడల్లునితో జెప్పెను. ఆదినము మొదలామె విగ్రహారాధనమును మాని

వైచెను. కారణ మేమని యడుగ "శివుడే నా యిల్లుడై యుండ నిక నాతని ప్రతిమ నర్చింపనేల" యని ప్రత్యుత్తర మిచ్చెడిది.

హరప్రసన్న మజుందారుని భార్యగూడ మహాశయుని భక్తులలో నొకపేరుపొందిన యామె. వివేకానందుడు డామెనుగూర్చి యొక శిష్యునితో "వీ యూరియందు వంచి పాండిత్యమును భక్తియు పొంది యున్న స్త్రీ యామె యొక్కతెయే" అనెను. మహాశయు డామె "నమ్మా!" యని పిలుచుచు నామె చేతినుండి భుజించుట కెంతయో ఉత్సహించువాడు.

ఏదేశమున నెచ్చోట నెట్టి క్షోభము సంభవించినను అచ్చట మహాశయుడు ప్రత్యక్షమైనమాత్రమున అంతయు నివారణ మగునని యాతని శిష్యులలో నొక గొప్ప విశ్వాసము గలదు. దాని కనుగుణముగ దమ దేశములయందెట్టి క్షోభము సంభవించినచో వా రాతని గొంపోవువారు. ఇట్టి సందర్భముననే యాత డొకనాడు భోజేశ్వరమునకు వెళ్ళియుండెను. హరప్రసన్నునియూరు దానికి చేరువ యగుటచే నాతని నచ్చటికి కాతడు పిలుచుకొనిపోయెను. ఆతని భార్య మహాశయుని అంతకుముందు చూచియుండలేదు. తనభర్తయొక్క సాధువునెడ భక్తిగలిగి యుండెనని మాత్ర మెరుగును. ఆమె స్వభావ సిద్ధముగా భక్తురాలు. దానికి తోడిట్టి భగవద్భక్త సందర్శనము లభించెను. అప్పటినుండి యాతని నామె పుత్రునివలె ప్రేమించుచు నప్పుడప్పు డాతని దర్శనము నకై దియోబాగునకు బోవుచుండెను. ఒకదినమున వీరిద్దరును నడచుచు వచ్చుచుండ నొకవైష్ణవియగు భిక్షుకి యెదురువచ్చెను ఆమె యూరి కాతకును పరిచితురాలు. ఆమె మహాశయు డొక స్త్రీ వ్యక్తితో (హర ప్రసన్నుని భార్యతో)కలిసిపోవుచుంట గాంచి "మర్గాచరణా! యీపె యెవతె?" యని యడిగెను. అందుల కాత "డీమె నాతల్లి" యనెను. ఆ

## నాగమహాశయుని గార్హస్థ్య జీవితము

స్త్రీ యీమె యాతని తల్లి కాదని, యాతనిజనని బాల్యముందే గతించినదనియు, యెరుగును. దానిచే "నీమె నీకెట్టితల్లి" యని మరల ప్రశ్నించెను. తోడనే యాత "డీమె నాజనని. నిక్కముగ నా జనని" యని మరల ప్రత్యుత్తరమిడెను. అంత నా ముదుసలి "యిప్పుడు నిన్ను సరిగఁదెలిసికొంటిని! నీపేరు దిగంతము వ్యాపింపదగినది. నాయనా! చిరంజీవివై మన మాతృభూమికి కీర్తిని సంపాదింతువుగాక" యని దీవించెను.

హరప్రసన్నుని భార్య చక్కగ పాడగలదు. మధురమగు తన కంఠమున జగన్మాతస్తవము బాడుచుండునప్పుడు "జనని తన్నుగూర్చి తానే పాడుకొనుచున్న"దని మహాశయు డనువాడు.

మహాశయుని జననియగు త్రిపురసుందరికి మాధవి ధానరాణి యను పెదతల్లిగలదు. ఆమె మనుమని మిక్కిలి ప్రేమించెడిది. మహాశయు డామెను "అవ్వా" యని పిలుచును. ఆమె డకాక్కు సమీపమున నొక యూరియందుండెడిది. ఇప్పటికిని ఆదేశమునందామె గుణసంకీర్తనము జరుగుచుండును. మహాశయుడామెను జూచుట కప్పుడప్పుడు పోవువాడు.

దియోభాగున కనతిదూరమున కాశీపురమను యూరు కలదు. అందొక మహమ్మదీయుడు మహాశయునియెడ భక్తిగలిగి యుండెను. అతని భావములు ఇతరులకువలె సంకుచితములుగాక విశాలవంతముగనుండెను. అతడు మహాశయు నొకపీరు (భగవంతుని కనుగొనినవాడు)గ భావించి యాతని హితోపదేశములను భగవంతుని యాజ్ఞలుగ శిరసావహించును. ఈ మహమ్మదీయుడు మహాశయునికి సేవ చేయవలెనని చాల యాశపడెను. నాగమహాశయు డాతనినొక గొప్ప

సాధుపునిగ ఎఱిగియుండుటచే యాతనిసేవ నొల్లక, ఆతని నతి భక్తి భావముతో నెదుర్కొనుచుండెను. ఆతడు తరచు మహాశయుని యొద్దకు బోవుచు నాతని పవిత్రగోష్ఠియందుండును. ముదుసలియై డెబ్బది సంవత్సరములవరకు జీవించెను. తన సహధర్మిణి బాల్యమందే కాలగతి నొందినను మరల వివాహము చేసికొనక భక్తిపరుడై జీవితమును అతి పవిత్రవంతముగ గడపెను. సంసారబాధ్యత నంతయు కుమారునిపై బడవైచి నిశ్చింతగ భగవధ్యానమును సలుపుచుండెను.

మహాశయుడు తరచు ఇట్లు చెప్పువాడు :— "పరమేశ్వరుని యీ విశాల రాజ్యమందు జాతిమత భేదములు లేవు. ఆతని దృష్టి కందరును సమానులు. ఏనామమున నేరూపమునం బూజించినను తా నాతని స్వాధీనమందుంటినని మనమున నాతని చరణకమలములనే సర్వదా ధ్యానించుచు నాతనినే శరణుజొచ్చియుండునో ఆత డాదయామయుని కృపకుం బాత్రుడగును. వివిధములగు నీ మతము లాతని రాజ్యమును జేరుట కేర్పరుపబడిన వివిధమార్గములు."

నాగమహాశయుని దయకు పాత్రుడై జీవితము మారి సన్మార్గావలంబులైన వారిలో దియోభాగనందలి కాళీకుమార్ భునియా యను నాతడొకడు. ప్రథమమున నాతడు మిక్కిలి బీదవాడు. కాని తరువాత నాతడు దియోభాగనందలి యొక సంపన్నునికి దత్తుపోయెను. కాళీకుమారుడు యౌవనమున దుష్టుడుగను జారుడుగ నుండి పెంపుడు తండ్రినుండి సంక్రమించిన ధనమునంతయు వ్యయపరచెను. నాగమహాశయుని సత్సంగతి యబ్బినను ప్రథమమున తా నలవాటుపడిన దుర్గుణములనుండి మరల్చుకొన లేకపోయెను. అందువలన మహాశయుడు మొట్టమొదట నాతని జూచువాడుకాడు. పూర్వపు దుష్కార్యములం దలచుకొని కాళీకుమారు డాలోచనా పరుడై యాతనియొద్ద కూర్చుండు

వాడు. ఒకసారి యాతడు తన తల నొక స్తంభమునకు కొట్టుకొనుచుండ మహాశయుడు చూచెను జాలిగొన్నవాడయ్యు నది పైకి దెలియ నీక "ప్రతి వ్యక్తియు తన కర్మఫలము ననుభవించి తీరవలయు" ననెను. ఆ యువకు డీతని సాంగత్య మబ్బిన కొలదియు దుర్గుణముల నుండి విముక్తుడై జీవిత మత్యంత పవిత్రతమముగ గడపెను.

హరప్రసన్న మజుందారును గూర్చి యిదివరలో తెలిపి యుంటిమి. అతడు మహాశయుని భక్తశ్రేష్ఠులలో నొక్కడు. ఒకసారి మహాశయుడొక భజనసమాజమున భగవత్కీర్తనలఁ బాడుచుండ పరవశుడై స్మృతితప్పి పడియుంటయు నాతని ముఖమందు బ్రహ్మతేజము మూర్తీభవించి యుండుటయుఁ జూచి యాత డచ్చెరువడి "ఈతని మనస్సు భగవంతునియందు లీనమై యుండనోపును. ఇదియే సమాధి" యనుకొనుచు ఆతని పరిచయము గలిగించుకొనుట కాతురత పడెను. నాగమహాశయునిగూర్చి తెలిసిన కొలదియు నా కోరిక ప్రబలమై యెల్లప్పు డాతనిసన్నిధినే యుండవలె ననియు నాతని దర్శనము చేయవలయు ననియు నువ్విళ్లూరుచుండెను. మహాశయు డాతని మిక్కిలి ప్రేమించుచుండెను. మార్గదర్శకములగు మహాశయుని గుణములన్నియు నీహరప్రసన్నునియందు మూర్తీభవించెను. ఆతని విశ్వాసము, నమ్రత, భక్తి, యన్నిటికన్న నెక్కుడగు నతిథి సంసేవనము మొదలగు గుణముల జూచిన మహాశయుని యపరావతార మన నొప్పును.

యౌవనమునం దతిసుఖలాలసుడుగ నుండిన నతోబారు ముఖర్జి యను నొక యువకుడు మహాశయుల సాంగత్యమువలన తన జీవితమున నొక గొప్ప మార్పుగలిగి ప్రవర్తించెను. అతనియందలి యొక విశేష గుణమేమనగా తనకు సరియనియు ధర్మమనియు తోచినకార్య మెట్టి

దైనను అందు ఎంత త్యాగమొనర్పవలసియున్నను ధైర్యవిహ్వలుడు గాక యాతడొనర్చితీర్చువాడు. ఆతనికి కొంత కవిత్వముఁజేయు శక్తి గూడ నుండెను. ఒకసారి యాతడు భగవంతుడు పాపులను రక్షించుటకొరకై మనుష్యావతారమెత్తెనని యొక నాటకమును రచించెను. అది దియోబాగనందు ప్రదర్శింపగ నాగమహాశయుడు చూచెను. ఆ నాటకమందు నమ్రతయొక్కయు దయయొక్కయు మూర్తియైన నాగమహాశయునివంటి పాత్ర యుండెను. నతోబారు గూడ దియోబాగు నివాసియే. మహాశయుని భార్యను శిష్యులను మిక్కిలి గౌరవించుచు ప్రాణాధికముగ జూచువాడు.

శ్రీరామకృష్ణుని శిష్యులలో అన్నాదా ఠాకూరనునాతడు పేర్వడసియుండెను. చదువను వ్రాయను దెలియకయున్నను ఆతనికి ఈశ్వరునియందు గొప్ప విశ్వాసము. తరచుగ నాతడు మహాశయుని వద్దకు వచ్చుచుండువాడు. మహాశయుడు గూడ నాతని నిరాడంబర వర్తనమునకు సంతసించి ప్రేమించువాడు. ఈతడు ఢక్కాలో నున్నప్పుడు ప్రభుత్వోద్యోగియగు నొక స్నేహితుని గృహమునకు పోవుచుండెను. వివేకానందుడు అమెరికాయందు గడించిన కీర్తికి అతనిపై యసూయజెందిన యా యుద్యోగి, స్వామిపై నెన్నియో నేరములను కల్పించి చెప్పుచుండెను. అన్నాదా ఠాకూరది సహింపలేక "స్వామిజీని గురించి ఇంకొకమాట చెప్పితివా నీ ప్రాణములు నీకు దక్క"వనెను. ఆదినము మొదలా పురుషుని మఖమ నాతఁడు దర్శింపలేదు. ఆతని యంత్యదివసములు శ్రీరామకృష్ణుని మహాశయుని నామములు నాల్కపై దాండవమాడుచుండ గడచెను.

హరకామినినిగూర్చి ఇంతకుముందే చెప్పియుంటిమి. ఈమె భర్తయగు కైలాస చంద్రదాసుడు గూడ మహాశయుని చరణదాసు

డయ్యెను. నాగమహాశయు డెల్లరను నారాయణాంశులుగ దర్శించుటచే నేరివల్లను సేవపొందుట కొల్ల డయ్యెను. అయినను ఈతని విషయమునమాత్ర మా నియమము లేకుండెను. ఆత డీసాధువును గురువుగ భావించి అతని యాజ్ఞను ప్రేమతోను నమ్రతతోను శిరసా వహించి సేవ సేయుటయే తన జీవితముయొక్క పరమావధిగ నెంచుకొనెను.

పార్వతీచరణు డనునాత డింకొక భక్తుడు. ఈత డేకాంతమును మిక్కిలి కోరువాడు. మత విషయమో యెన్నడును చర్చింపడు. నాగమహాశయునియం దత్యంతవిశ్వాసము గలిగి యాతనిపై ప్రతివిషయమున నాధారపడి యుండెను. ఇతరులు వేదాంతసంశయములను గూర్చి చర్చించుచుండునప్పు డీతడు నిశ్చలముగ గూర్చొని తన యిష్టదైవమును ధ్యానించును.

మహాశయుని పొరుగింటివా డగు గోపాలచంద్రచక్రవర్తి అతని సాన్నిధ్యమును మొదట చవిజూచిన భక్తుడు. ఆతని నుండి మహాశయుని చరిత్రమును కీర్తియు విననవా రాతని కెంతయు కృతజ్ఞులు. బాల్యావస్థలో నొక స్త్రీ యాతనికి * మధురభావ ముపదేశించెను.

దానివలన నాతని యందొక నూతనతేజ ముద్భవింప యాతని యందొక వశీకరణ శక్తికూడ యుండెను. భక్తబృందములో నీతడు

*భగవంతునిపట్ల భక్తునికి యుండదగు భావములలో నత్యున్నతమైనది. బృందావనమందలి గోపిక లీభావముననే గొలిచిరి. కాని సాధకుడు ఈ భావమును ప్రప్రథమముననే యవలంబించిన యధఃపతితుడగును. గనుక నిది కొంచె మపాయ కరమైనది.

సత్యగోపాలుడని పేర్కొనబడును. ఈతడు చక్కగ పాడగలడు. మరియు మృదంగవాద్యమున నసమానుడు. నాగమహాశయు డీతని మొదట చూచినప్పుడు "సత్యగోపాలుడు గొప్పభక్తుడు. పూర్ణమగు విశ్వాసము కలవాడు. కాని యీతనికి ఇంద్రియసుఖములయం దాశ ఇంకను వీడలేదు" అనెను. తరువాత నీతనికి మహాశయునితో సంబంధ మేర్పడ యగుకొలదియు తన తప్పిదములన్నియుఁ దెలిసికొని మత్సర భావమును వదలి సాధారణ భక్తిమార్గ మవలంబించెను. నాగమహాశ యునిఁ దనగురువుగ భావించుచు నాతని వేదములకన్న మిన్న యని గొల్చుచుండెను.

పైన పేర్కొనఁబడినవారు గాక మహాశయుని భక్తు లింకను ఎందరో కలరు. మనమెరుగనివా రికెందరుండిరో తెలియదు. అట్లు ఒరుల కెరుకపడుట వా రొల్లరు. ఒకసారి మహాశయుని దివ్యరూప సందర్శనముఁజేసిన నెట్టివారైనను నాతని మరువజాలరు. ఎందరు యువ కులో యాతని కటాక్షమువలన తమ జీవితములు మార జీవితము యొక్క పరమావధిని తెలిసికొనిరి వివేకానందస్వామి అట్టి మహాపురు షుల సాంగత్యమున నైదు నిముషములలో నెట్టివారి జీవితములైనను పూర్తిగ మారి పవిత్రతమము లగునని చెప్పియున్నారు. "మతము గురువునుండి శిష్యునకు సంక్రమించు"నను నీ వాక్య మీతనియెడ సత్య మయ్యెను.

# అంత్య దినములు - మహాసమాధి

B. S. 1306 వ సంవత్సరమున నాగమహాశయుడు దుర్గ పూజకు యథాపూర్వము కలకత్తాకు రాలేకపోయెను. ఆ సంవత్సరము నవంబరు మాసమున కలకత్తాలోనున్న చక్రవర్తి యను నాతని భక్తునికి మహాశయుల భార్యవద్దనుండి మహాశయుడు తీవ్రమగు జబ్బుచే బాధ పడుచుండెనని తంతివార్త వచ్చెను. ఆనాడాభక్తుడు శ్రీరామకృష్ణ సమాజ సభయందు "వేదమతము" అను వ్యాసమును చదువవలసి యుండెను. అందువలన నాతని కేమి చేయుటకును దోచకుండెను. కాని యద్భుతానందస్వామి యాతనితో "నోయీ నీకు వేదములగూర్చి చెప్పుట కెన్నియో తరుణములు లభించును గాని యీ సమయముదప్పిన ప్రత్యక్ష వేదమగు నాతని జూచుట తటస్థింప"దని చెప్ప నాత డానాడె మునసే దియోబాగునకు పయనమయ్యెను.

మరునాడు చీకటిపడుటకు పూర్వమే దియోబాగు చేరుకొనెను. చక్రవర్తి లోనికి ప్రవేశించునప్పటికి మహాశయుడు తన గది ముందొక (పరదాలచే కట్టబడిన) చావడిలో పరుండి యుండెను. అది శీతకాలమగుటచే చుట్టుప్రక్కలనున్న పొలములనుండి చలిగాలి మిక్కుటముగ వీచుచుండెను. ఆచలిగాలికి యారోగ్యవంతుడే కొయ్య బారి పోవుచుండ నిక రోగిమాట వేర చెప్ప బనిలేదు. ఆచావడికి వైచిన పరదాలుకూడ చినిగిపోయియుండుటచే చలిని ఏమాత్రమును ఆప లేకుండెను. ఈస్థితియం దాతనిం జూచి యట్లాతని నా చావడిలో నుంచుటకు కారణమేమని శరత్కుమారి నడిగెను. అందుల కామె "నాయనా! ఏదినమునుండి యశక్తతవలన మంచము పట్టెనో నాటినుండి మేమెంత ప్రార్థించినను వినక నిచ్చటనే పరుండి యున్నారు. కొలది దినములకు పూర్వము శూలనొప్పివచ్చినది. ఆపైన గ్రహిణిబాధ సంభ

శించినది. రోగము ప్రబలమైనందున నాయాన యనుజ్ఞపై నీకు కంతి వార్త నంపితి"నని ప్రత్యుత్తర మిచ్చెను.

మహాశయులు తన బాధను ఒరులకు తెలుపరు. భార్యతో నొకసారి "నా ప్రారబ్ధము ఫలోన్ముఖమైనది. ఇక కొందిమాత్ర మనుభవింప వలయు" ననెను. ఈ రోగ మంకురించుటకు పూర్వ మాతని దేహము కృశింప జొచ్చెను. పగటిపూట మాత్రము కొలది భుజించి రాత్రులం దుపవసించువాడు. అంతకంతకు శల్యావశిష్టు డయ్యెను. భార్య యధైర్యచిత్తయై యేడ్వగా "అస్థిమలమాంస భూయిష్ఠమగు నీ దేహమునకై విచారింపకు" మనెను. ఎందరు బ్రతిమాలినను మందుపుచ్చుకొనుటకు సమ్మతింపలేదు.

ఇప్పు డాతని రోగ మతిశయింప నా తెరలమధ్య పరుండెను. ఎందరో ఆతని లోన పరుండుటకు ప్రార్థించిరి కాని విఫలమనోరథు లైరి. జబ్బు సహింపరానిదిగ నుండినను రోగమునకు లొంగక నితర మును మరచి శ్రీరామకృష్ణ నామమునే జపించుచుండెను.

ఇట్లు పదునూడు దినములు బాధపడెను. చనిపోవువరకును చక్రవర్తి పక్కను గూర్చుండి భగవద్గీతలను ఉపనిషత్తులను చదువుచు నొక్కొక్కప్పుడు జగన్మాతను స్తవము జేయుచు, నవసరమగు నప్పుడు సేవ జేయుచు నుండెను. ఆతని కీర్తనల వినినప్పుడు స్మృతిరహితుడై గంటలకొలది సమాధి నిమగ్నుడై యుండువాడు. సమాధి తీరిన యంతనే నిద్రనుండి మేల్కొను పసిబాలుని చందమున "నమ్మ యమ్మ" యని యేడ్చువాడు. ఆసమయమున నాతని జూచినచో నాతడు తప్పక సాత్వికమూర్తి యని యనుకొనుట నిశ్చయము. చైతన్యము వచ్చినతరువాత నొక్కడు "సచ్చిదానంద, అఖండ చైతన్య" యని యుచ్చరించువాడు.

# అంత్య దినములు - మహాసమాధి

జబ్బులో నున్నంత కాలమును ఆతని భక్తులు ప్రతిదినమును వచ్చి చూచుచు నొకొక్కప్పుడు రాత్రులు గూడ నచ్చటనే గడుపుచుండిరి. అంతటి యవస్థలో నున్నను మహాశయుఁ డాశ్చర్యజనకముగ అతిథి నారాయణస్వరూప మను సిద్ధాంతమును మరువక సత్కరించువాఁడు. వారికి త్వరగ భోజనము పెట్టువిషయమునను నిద్రపోవుటకు తగు సదుపాయములఁ జేయుసందర్భమునను భార్యను హెచ్చరించుచు అతిజాగరూకుఁడై యుండెను. వారికి సరిగ సత్కారము జరుగుచున్నదో లేదో యని మిగుల నాతురత జెందువాఁడు. ఆపదుమూఁడు దినము లొక ఉత్సవమువలె నుండెను నాగమహాశయుఁ డొక్క శ్రీరామకృష్ణులఁ గూర్చి తక్క నితర విషయముల గూర్చి మాటలాడక పోవుటచే నతిథు లాపవిత్ర భావతరంగములయందు మునిగి తమ కష్టములను మరచి యొక్క భగవంతునే సదా ధ్యానించు చుండిరి. తన జీవితమును గూర్చి గాని రోగమును గూర్చి గాని వారెవ్వరైన శ్రద్ధగొని యెట్లుండునో యేమో యని భయము జెందుచో వారితో "నయ్యా! శల్యభూయిష్ఠమగు నీ కళేబరముఁ జూచుట కెందుల కంతవ్యయప్రయాసలకోర్చి వచ్చితిరి? ఇది యిక నెంతో కాల ముండదు. ఇది మాటిమాటికి మారుచుండు" ననును.

చక్రవర్తి, మహాశయుడు వ్యాధిలో నున్నప్పుడు రాత్రిం బవళ్లచ్చటనే గడపెను. మహాశయు లొకొక్కమారు "ఈశ్వరుడెంత కరుణామయుడు! ఇది యంతయు నాతని కరుణాప్రసార సంజనితమే" యనువాడు. కాని యాతని బాధ జూచి చక్రవర్తి యొకసారి "భగవంతుడు దయామయుడు కాడు క్రూరు"డని యనుకొనెను. నాగమహాశయుఁ డాతని మనోభావము గ్రహించి "నాయనా! భగవానుని దయఁ గూర్చి యీషణ్మాత్రమును సంశయింపకుము. ఈ కళేబరము ప్రపంచ

మున కేమి యుపకృతి చేయగలదు? ఇది యిప్పుడు మంచమెక్కినది. ఈ యవస్థలో నా గృహమున కేతెంచు నారాయణమూర్తులను సేవించ లేకున్నాను. అందువలన శ్రీరామకృష్ణుడు తన యనంతమగు కృపా మహిమచే నీ దేహమును మరల పంచభూతములం గలయునట్లు చేయు చున్నా"డనెను. తరువాత క్షీణకంఠముతో నెమ్మదిగ "దేహము తన జాగ్రత్త యందుండుగాక, దుఃఖములును కష్టములును తను జాగ్రత్తలో తాముండుగాక. ఓమనస్సా! నీవుమాత్రము దీనియందుకాక యానంద మయ ఆత్మస్వరూపముననే మగ్నమై యుండుము." అని తన్నుదాను హెచ్చరించుకొనెను.

మరల చక్రవర్తి దిక్కు మొగమై "ఈ దేహమునకై విచారింప కుము. మాంసమజ్జాయుత మగు నీ దేహమును మరచిపొమ్ము. జగ న్మాత సంకీర్తనము చేయుము. శ్రీరామకృష్ణ చరిత్రమునే చెప్పు కొనుము. ఇదియే ప్రాపంచిక వ్యాధులను నిర్మూలన మొనర్పగల్గిన యౌషధము." అంత చక్రవర్తి భక్తిపూరితుడై మాతాసంకీర్తన మొన ర్చుచు దేహమును మరచెను. కొంతవడికి శరత్కుమారి పిలువగా తెలివివచ్చి చూచునప్పటికి మహాశయులు మంచముపై గూర్చొని యుండెను. మాపులు నాసికాగ్రమున బంధింపబడియుండెను. కను కొలకులనుండి కన్నీరు చెక్కిళ్లపై ప్రవహించుచుండెను. సంకీర్తన మును వినుచు నతడు సమాధిగతమనస్కుడయ్యెను. అత డట్లు కూర్చొనియుండగా చక్రవర్తి చూచియుండలేదు. ఇతరుల సహాయము లేనిదే ఒకప్రక్కనుండి యింకొకప్రక్కకు పొరలుటకు కూడ శక్తిలేని యాతడు ఇట్లు కూర్చొనియుండుట వారికి ఆశ్చర్యమును గొల్పెను. చక్రవర్తి శరత్కుమిను లది యేమియుపద్రవమును దెచ్చునో యని కంపింపసాగిరి. వా రెట్టకేలకు అతనిని నెమ్మదిగ పరుండబెట్టిరి ఇం తలో మహాశయునికి తెలివివచ్చి జగదీశ్వరీనామ ముచ్చరించుచుండెను.

# అంత్య దినములు - మహాసమాధి

ఆ దినమునకంటె నాదినము రోగము వృద్ధియగుచుండెను. కొంచెమైనను ఆహారము లోనికి పోవుటలేదు. క్రమముగా ఎవరైనను ఆతనివద్ద రాత్రులు మేల్కొనియుండవలసినయవసరమువచ్చెను. శరత్తు మరియు చక్రవర్తియు ఒకరితరువాత నొకరు మేల్కొని కనిపెట్టుకొనియుండసాగిరి. ఒకసారి చక్రవర్తి యధైర్యచిత్తుడై వినయముతో "అయ్యా! మీకరుణామృత మొకింత నాపై వర్షింపుడు. మీరీప్రపంచమును వీడినతరువాత నేనెట్లు జీవింపగలను? ఎవరిపై నాధారపడియుండగలను?"ననెను. అంత మహాశయుడు "ఇందు భయపడవలసిన విషయమేమున్నది? శ్రీరామకృష్ణపాదముల శరణుజొచ్చిన తరువాత నాయన దయ తప్పక నీపై ప్రసరించుననని నమ్ముము. ఎవరాతనిం గోరుదురో వారాతని దెలిసికొనితీరుదురు"ననెను.

ఈ కాలముననే శారదానందస్వామియు రామకృష్ణోద్యమ వ్యవహారములసందర్భమున ఢక్కాలో నుండెను. ఆతడు తరచు మహాశయునివద్దకు వచ్చి యాతనిపరిచర్యవిషయమై తగు సలహా నిచ్చుచుండెను. ఆతడు మిగుల చక్కగ పాడగలడు. అందువలన మహాశయు డాతని నొకనాడు శ్రీరామకృష్ణులు ప్రేమించు కీర్తనలను పాడుమని కోరెను. అంత నాతడు మూడు కీర్తనలను పాడెను. మహాశయుడు సమాధిగతుండాయెను. తోడనే శారదానందులు చెప్పినట్లు భక్తులాతని చెవిలో జగదీశ్వరీ నామోచ్చారణచేసినంతనే తెలివివచ్చెను.

మహాశయునికి తాను దేహమును చాలించుటకు పూర్వము కాళీమాతను పూజింపవలెనను కోరిక యుదయించెను. అందులకొక దినము నిశ్చయింపబడెను. కాళీవిగ్రహమును తీసుకొనివచ్చిరి. శారదానందుడు "యీ ప్రస్తుతావస్థలో ప్రక్కనుండి లేచి యాత డీవిగ్ర

హమును జూచుట కష్టము. అందువలన నా విగ్రహము నాతని పడక వద్దకు గొనితెండు. ఆతడు దర్శించినతరువాత పూజకై మరల మండపమున బెట్టవచ్చు"ననెను. అప్రకారమే విగ్రహము నెదుటబెట్టిరి. చక్రవర్తి "అయ్యా! అదిగో నీవు పూజింప నభిలషించిన విగ్రహ మెదురుగ నున్నది చూడు" డనెను. అప్పటికి అతడు కండ్లుమూసికొని యుండెను. ఈమాటల వినినతోడనే కండ్లుతెరచి చూచునప్పటికి విగ్రహము కన్పట్టెను. తోడనే స్మృతిరహితుడై "అమ్మా! అమ్మా!" యని కేకలిడి సమాధిచెందెను. జగదీశ్వరీనామము చెవియం దుచ్చరించిరి. కాని యీసారి చైతన్యము రాలేదు. నాడి నిలిచిపోయెను. హృదయచలనము గూడ నాగిపోయెను. శరత్స్వామిని "అయ్యో! మా తొపూజనము వంకబెట్టి మనలను విడిచిపోయె"నని యేడువ దొడగెను శారదానందు "డమ్మా! కంపించి యాతని ముందు కేకలిడుము. మరల నాతనికి స్మృతివచ్చు" ననెను. ఈరీతిగ రెండుగంటలు గడచెను. తరువాత హఠాత్తుగ నాత డమ్మాయని కేకలిడుచు మరల ప్రకృతావస్థకు వచ్చి "పూజయైనదా?" యని యడిగెను. అంతట చక్రవర్తి "విగ్రహమును మీయెదుట నుంచితిమి. మీయాజ్ఞ యైనతోడనే దానిని మండపమున నుంచి పూజింప నెంచితి" మనెను. పిదప నాగమహాశయుని యాజ్ఞపై శాస్త్రవిధిగ తను పూజల నొనర్చిరి.

మరునాటి ప్రాతఃకాలమున చక్రవర్తి "నిన్నటి మీ యవస్థ గాంచినతోడనే. మరల మీ రీప్రపంచమునకు రా రనుకొంటి" మనెను. అందులకు మహాశయులు నీరసమగు స్వరముతో "ప్రారబ్ధము కొంఆక యున్నంతవరకు ఈ దేహము పో"దనియెను.

పూజానంతర మందరును జనని ఈకిటి ఈతని కటాక్షించి రక్షించు నని యాశజెంది యుండిరి. కాని మహాశయుడు "జగదీశ్వరి

నన్ను రక్షించుటకు గాక నాయభ్యుదయమును గోరు మిమ్మందరిని దుఃఖములనుండి రక్షించుటకొరకు దయచేసినది. జగన్మాత మీయందరిపై దయ వర్షించి యాశీర్వదించు గాత" యని యనుటచే కాళీపూజయందలి యాతని భావమును వారు గ్రహించిరి మరునాడు శ్రీరామకృష్ణుని గూర్చి ముచ్చటించునప్పుడు "మీ కందరకును శ్రీరామకృష్ణుని చరణకమలములయందు భక్తివిశ్వాసము లుదయించు గాక. నేను తుచ్ఛుడను. నే నెందులకును పనికిరాని యధముడ నని యాతడెరుగును. కాని యాతడు ప్రేమప్రపూర్ణు డగుటచే నన్నాతని ప్రేమవార్ధియందు ముంచె" ననెను. పిదప 'జయరామకృష్ణ' 'జయరామకృష్ణ' యనుచు నమస్కరించెను.

మరునాడు మహాశయునికి పితృశ్రాద్ధకర్మలకై యప్పిచ్చిన యతఁడు అతని చూచుటకై వచ్చెను. మహాశయు లతనికి నమస్కరించి "అయ్యా నీయప్పుల దీర్చలేకయున్నందుల కెంతయు విచారించుచున్నాను. నీ యుదారస్వభావమువలననే నాతండ్రి కంత్యక్రియలఁ జేయగల్గితిని. కాని నీవను విషయమై యాతురత జెంద నవసరము లేదు. నేను చనిపోయిన తరువాత నీ గృహమును నీ యధీనము జేసికొనుము. నా భార్య పుట్టినింట నుండు" ననెను. ఇది విని యాతడు మిగుల ఖేదించి "అయ్యా! అప్పువిషయమై విచారింపకుడు. నే నప్పుకొరకు రాలేదు. మిమ్ము చూచుటకు వచ్చితి" ననెను. "ఇది యంతయు దేవదేవుని దయ" యని మహాశయులు కొంతవరకు కండ్లు మూసికొని యుండెను.

ఈ సత్పురుషుడు వెడలిపోయిన మూడు గంటలకు మహాశయుని యందొకవింతయగు మార్పు గల్గెను. ప్రక్కమీద నుండలేక ఇటునటు పొరలుచు సంధిలో అప్రసక్తముగ మాటాడ జొచ్చెను. చుట్టుప్రక్క

లంతయు చలిగా నుండెను. అయినను ఎంతసేపు విసరినను వేడి తగ్గ లేదు. ఆతడు "ప్రక్కనుండి లేవవలెనని యున్న" దనెను. అందు వలన లేవదీసి కూర్చుండబెట్టిరి. కాని తత్క్షణమే మరల పరుండబెట్ట వలసివచ్చెను. మరల కొంతసేపటివరకు నిశ్శబ్దముగ నుండి మరల సంధిలో మాటలాడజొచ్చెను. ఇంతలో హఠాత్తుగ "రక్షింపుడు రక్షింపు" డని యరచెను. శరత్స్వామిని యేడ్చుచు "నీవే కాదా నీయంత్యసమయమున నెట్టిసంధికిని లోబడనని చెప్పియుంటివి? మరి యిప్పుడెందులకు కలవరపడుచున్నా" వనెను. పిదప నొకగంటకు తెరపివచ్చి నిద్రజెందెను.

ఈ హఠాత్సంధిని గూర్చి చక్రవర్తితో వివేకానందు డిట్లనెను. "ఆ సమయమున నాతని బహిఃప్రకృతిని మాత్రమే చూచితివి కాని లోపల నేమి జరుగుచుండెనో తెలియనైతివి. అప్పు డాతడు లోపల పూర్తిగ తెలివిగలిగియేయుండెను. మనుష్య స్వరూపమునుండి మనుష్య స్వాభావికములగు బాధల నందకున్నచో నాతడు మనుష్యమాత్రు డని చెప్ప వీలుకాదు. ఇట్లే ఇతర ముక్తపురుషులయందు ఎందరియందో చూచియున్నాము. జీవన్ముక్తుడగు మహాశయునియం దిదియొకలోపముగ ఎన్నదగినది కాదు. మరియు నాత డెట్టియవస్థయందుండి యిట్లు 'రక్షింపుమని' కేకలిడెనో చెప్పజాలము. ఈ శరీరమునుండి త్వరలో విముక్తుడై యాత్మైక్యసంధానము పొందుటకొరకు కేకలిడి యుండ వచ్చును." ఈ విషయమునే శ్రీయుత గిరీశచంద్ర ఘోషిట్లు తన యభిప్రాయము దెల్పెను. "శ్రీరామకృష్ణుని శిష్యులలో నెవ్వరును కైవల్యముకొరకపేక్షింపరు. ఒకవేళ అట్లపేక్షించినను నిర్వాణముకు నందజాలరు. ఎందువలనన 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' యను గీతావాక్యము ప్రకార మీ జగత్తు నధర్మమునుండి

రక్షించి ధర్మసంస్థాపనము చేయుటకు మాటిమాటికి భగవంతు డవతార మెత్తుచుండవలయును. అతనితో నీ సిద్ధులును మహాపురుషులునుగూడ మనుష్యస్వరూపమున వచ్చుచుండవలయును. నాగమహాశయునికి ప్రపంచమున నేమాత్రమును ధ్యానము లేకపోయినను మాయను సంపూర్ణముగ జయించినవా డయినను తాను మరల నిచ్చటికి వచ్చి శ్రీదేవదేవుని లీలయందు పాల్గొనుటకై ఈ కొలది ఇచ్ఛతో శరీరమును విడిచెను."

ఎట్లైనను ప్రాణము పోవువరకు నతనికి మరల ఇట్టి సంధి రాలేదు.

ఇక మూడుదినములకు చనిపోవుననగా మహాశయుడు చక్రవర్తిని పిలచి పంచాంగముం జూచి "ప్రయాణమునకు మంచిముహూర్త మేర్పరుపు"మనెను. పాపము చక్రవర్తి యిది కడపటిప్రయాణ మని యెరుగడు. అమాయకముగ "పుష్య త్రయోదశి నాడు ప్రొద్దున పది గంటలకు ప్రయాణమునకు బాగున్న"దనెను. మహాశయుం డంత "చక్రవర్తీ! నీ వెప్పైనచో నాడినమున నా కడపటి ప్రయాణము సాగింతు"ననెను. పాపము చక్రవర్తి నిస్తబ్ధుడై కొంతవడికి తెలివి దెచ్చుకొని శరత్కుమారితో నీసంగతి నంతయు జెప్పెను. పిదప నామె "నాయనా! యిక నాయనకై విచారించుటవలన లాభములేదు. మరి యెంతోకాలము జీవింపరు. ఆయన యిష్టమే జరుగుగాక. శ్రీరామకృష్ణుని సంకల్పమే నెరవేరుగాక" యనెను.

మరణమునకు రెండు దినములకు పూర్వము శరత్కుమారి, చక్రవర్తి, మరి యింకొక భక్తుడును శయ్యావద్ద కూర్చొనియుండిరి. మహాశయుడు కండ్లుమూసికొని పరుండియుండెను. హఠాత్తుగ కండ్లుతెరచి

"శ్రీరామకృష్ణుడు తీర్థయాత్రా స్థలములను నాకు జూపింప నిట కేతెంచినాడు. చక్రవర్తీ! పుణ్యస్థలములం గొన్నిటినిం జేరొక్కనుము. నేను వానిని చూచెద"ననెను. ఈతని రోగమునకు కొలది దినములకుం బూర్వమే చక్రవర్తి హరిద్వారమునకు పోయియుంటచే హరిద్వారముం జేరొక్కెనెను. అంత మహాశయు డుద్రేక పూరితమగు కంఠమున "హరిద్వారము, హరిద్వారము, అదిగో గంగామతల్లి హిమాలయములనుండి మర్మరధ్వనులతో వచ్చుచున్నది. ఆతీరములనున్న వృక్షములు తరంగముల ననుకరించు చున్నవా యనునట్లు నాట్యము చేయుచున్నవి. చూడు మాపైపున చాందీపర్వత మున్నది. ఆహా! ఎట్టి మనోహరమగు ఘట్టము! స్నానమాడుట కెంత సుందరముగ నున్నది. నదీగర్భమునుండి తీరము వరకు నొకదానిపై నొకటి మెట్లుకట్టబడి యున్నవి. దయుంచి ఒక్క నిముష మాగుము. ఈ యిరువదిసంవత్సరములలో నొకనాడైన నిచట స్నానముచేయలేదు. ఈపవిత్ర తీర్థముల నొక్కమునుకునైవి నాజన్మమును తరింపజేసికొననిమ్ము" అనెను. పిదప "ఓ గంగాభవానీ! అహః పతితోద్ధారిణీ! పాపప్రహారిణీ!"యని కేకలిడుచు సమాధిచెందెను. మరల స్మృతివచ్చినతరువాత నాతని చూడగా నప్పుడే స్నానము చేసినవాని వలె నుండెను.

తరువాత చక్రవర్తి ప్రయాగక్షేత్రముం జేరొక్కెనెను. అంత నమస్కరించి "యమునాదేవీ! జయము! గంగామతల్లీ! జయము! యిచ్చటెచ్చటనో భరద్వాజాశ్రమ ముండవలయునే. అది నాకిప్పుడు కాన్పింపదేమి? అదిగో గంగాయమునా సంగమము. అదిగో ఆప్రక్క పర్వతపంక్తి. అయ్యో తాపూరు నాకు భరద్వాజాశ్రమము చూపలేదు." అని సమాధిం జెందెను. అంత కొన్ని నిముషముల యనంతరము "ఇదిగో కన్పడుచున్నవి."మరల కొంచెము సేపాగి"అమ్మా నీవు రాజరాజేశ్వరివి.

# అంత్య దినములు - మహాసమాధి

నీవు సహజ శక్తిస్వరూపిణివి. ఏమమ్మా నీవిట్లు తిరుగుచుంటివి? శ్రీరామా జయము జయము"ని మరల సమాధిని మునిగెను. మరల స్మృతి వచ్చిన తరువాత సాగరతీర్థనామము పేర్కొనబడగా నాగమహాశయుడు సగరవంశోద్ధరణమును ప్రత్యక్షముగ గాంచెను. సముద్రమును దర్శించి మరల మరల నమస్కరింపసాగెను అనంతరము సురేశుడు కాశీక్షేత్రముం బేర్కొనెను. తోడనే "శివభగవానుడా జయము జగద్భర్తకు మంగళ మగుగాక. హరహర మహాదేవ శంభో" యనుచు "ఈమారి మహాత్మునియందు లీనమగుదు" ననెను. పిదప పూరి, శ్రీ జగన్నాథక్షేత్రములం బేర్కొనిరి. అంత మహాశయుడు "అల్లదిగో దేవదేవుని మందిరము. అప్రక్క స్వామి ప్రసాదమును విక్రయించు ఆనందబజా రదిగో." తరువాత నాలుగైదు మారులు శ్రీచైతన్యనామ స్మరణముగూడ చేసెను. అప్పటికి రాత్రి 4 గంటలయ్యెను. నిద్రమత్తు వచ్చుటచే నిద్రించెను. మరల ప్రాతఃకాలమున నెనిమిది గంటలకు మేల్కొనెను. పుష్య త్రయోదశి వచ్చెను. చక్రవర్తి బిగ్గరగ శ్రీరామకృష్ణనామ ముచ్చరించుచు ఆయనచిత్తరువు నెదురుగ బెట్టి "యిదిగో ఎవరి నామము నుచ్చరించుచు సర్వమును త్యజించి సన్న్యాసిజీవన మట్లు గడపితివో ఆ నీ గురువర్యుని చిత్ర మిదిగో" ననియెను. మహాశయుడు దానివైపునకుం జూచి నమస్కరించి క్షీణస్వరమున "కటాక్షము కటాక్షము. నీయనంతమగు ప్రేమసాగరమునుండి వెలువడిన ప్రేమ"యనెను. ఇవియే యాత డంత్యసమయమున నుచ్చరించిన వాక్కులు. ఇవియే యాతని తుదిపలుకులు.

సరిగా తొమ్మిదిగంట లగుసరికి యంత్యచిహ్నములు గన్పట్టెను. కండ్లు కొంచె మెఱుపువారెను. ఏదియో మంత్రముల చదువుచున్నట్లు పెదవు లదర నారంభించెను. పిదప నొకయరగంటకు దృష్టి

నాసికాగ్రమున స్థాపితమయ్యెను. రోమాంచితమయ్యెను. కంట్ల నానం దాశ్రువులు చిందెను. పదిగంటల యైగునిమిషములకు మహాసమాధిలో మునిగెను. శరత్కుమారి గాజ్ఞపై నాతని శుభ్రవస్త్రాచ్ఛాదన ముగు నొకపరుపుపై పరుండబెట్టిరి. అంతవరకును ప్రాణము పూర్తిగ బహిర్గతము కాలేదు. వెలుపలకు తీసికొనివచ్చిన యైదారు నిముషముల వరకును ప్రాణముపోలేదు. ఇప్పు డంతయు సమాప్తమైనది. ఈజగన్నాటకము నుండి యొక్క మహోర్వ్య నటకావతంసి తన పాత్రము ముగియగా తెరచాటునకు బోయెను. అప్పుడుకూడ నాతనిముఖము తేజఃపుంజమై యొప్పెను. సగము మూసిన యాతని కనుగోలకుల నింకను ప్రేమాశ్రువు లొకటి రెండుండెను. భక్తుల ఏడ్పులు మిన్నుముట్టినవి. చక్రవర్తి శరత్కుమారినిజూచి "అమ్మా! ఊరడిల్లుము. ఇది దానవు గాకుము. నీభార మాయన మాపై బెట్టి చనెను. నిన్ను సంరక్షించుటకు మీ పెద్దలము మేమున్నార"మనెను. శోకము యొక్క ప్రథమ ఆవేగము కొంచె మణగెను. పిదప నామెయనుజ్ఞపై నొకభక్తు డంగడినుండి నేయి, చందనపుకట్టెలు మొదలగు నుత్తరక్రియలకు వలయు సామగ్రిని దెచ్చుటకు బోయెను.

అనుభవజ్ఞులగు నూరివార లాశవమును పరీక్షించి యింకను వేడిగానున్నదనిరి. దహనసంస్కారముల కావించుటకు కొంత వరకు వేచియుండవలయునా యను సందియము వచ్చెను. అంత చక్రవర్తి "అయ్యా! నాగమహాశయునివంటి యోగీశ్వరుని శరీరమును దహనము చేయుటకింత తొందరపడకూడదు. చనిపోయెనని యనుకొన్న తరువాత నైనను పండ్రెండు గంటలయినను వేచియుండవలయు"ననెను. అందువలన రాత్రి పదిగంటలవరకు వేచియుండుటకు నిశ్చయించిరి.

మహాశయునిశిష్యు లాతని ఛాయాచిత్రము (ఫోటో)ను తీయుటకు ఉద్యమించిరి. ఆతడు బ్రతికియున్నప్పు డెన్నిమారులో

# అంత్య దినములు - మహాసమాధి

కోరిరి కాని యాతడు "శ్రీ యసిపంజరము యొక్క చిత్తరువు కొరకెందుల కింత యాతురపడెదరు?" అని వారల నిరుత్సాహపరచుచుండెను. ఇప్పుడు మంచిగంధము పూసి ఛాయాచిత్రమును దీసిరి. ఈ చిత్రమునుండియే ప్రియనాదసింహ యనునాతడు తైలచిత్రమును (Oil Painting) వ్రాసెను. అది యిప్పటికిని మహాశయులగృహము నలంకరించుచున్నది. ఈ పుస్తకమందున వ్రాసియున్న ప్రతిమ దీనినిబట్టియే వ్రాయబడినది

సంధ్యాపూర్వము శరత్కాలిని భక్త పాదములను, బిల్వదళము చేతను పూలచేతను పూజించెను. పిదప నా మృతకళేబరము చుట్టు నేడుమార్లు ప్రదక్షిణముసల్పి పొడవను తన కేశజములచే నాతని పాదములను దుడిచెను. అనంతర మాతని కళేబర మలంకరింపబడెను.

మహాశయుని మరణవార్త యూరంతయు ప్రాకెను. ఊరిలో నున్న యాబాలగోపాలము కడపటిసారి యీ యోగీశ్వరుని దర్శించు టకు వచ్చిరి. ఆ గ్రామమందా దినమున ప్రతి గృహమందునను హాహాకారములు మిన్నుముట్టెను.

రాత్రి పదిగంటలగుసరికి గంధపుచెక్కలతో చితియేర్పరుప బడెను. విధ్యుక్తక్రియల జరిపినతరువాత చితికి యగ్ని యంటింప బడెను. చక్రవర్తి చితిపై బిల్వదళముల వేయుచు వ్యాహృతిహోమ మును చేసెను. ఈలోపున శారదానందస్వామి వచ్చి చితిముందు సాష్టాంగపడెను. మూడు గంటలలో దహనమైపోయెను. శరత్కాలిని చితినార్పెను. భక్తులా బూడిదను మట్టి ధన్యులైతిమని తలచిరి. ఇట్లు తండ్రి గతించిన మూడు సంవత్సరములకు తన నలుబదినాల్గవ సంవత్స రమున తన జన్మస్థానమున స్వగృహమున నాగమహాశయుని భౌతిక శరీరము అదృశ్యమయ్యెను. బూడిదమాత్రమే మిగిలినది.

తరువాత శారదానందుని యాజ్ఞప్రకారము మాతనిచే రచింప బడిన యొక కీర్తనమును, ఈ బూడిదను ఒక పాత్రలోనుంచి యా

శ్మశానవాటికలో పూడ్చిరి. దానిపై యాత సంత్యసమయమున నారా ధించిన కాళికావిగ్రహమును బ్రతిష్ఠించి దానిపై యొక సుందరమగు నాలయమును నిర్మించిరి.

ఆతని యప్పులనుగూర్చి, తగు నేర్పాటులను గావించి శారదా నందస్వామి డక్కాకు బోయెను.

## పరిశిష్టము

నాగమహాశయులచే విరచితంబులగు కొన్ని గీతములు:—

### ౧

గిరివర! ఆర్ కొబే జాబే ఉమార్ ఆనితే కైలాసభవనే నాహేరియా బిధుముఖహృదయే దారుణదుఃఖ కొత్ ఆర్ సహిబోజీ బనే॥

శునియా శివేర్ రీతి, హృదయే ఉపజేభీతి,
భూతప్రేత సజ్గేసాథీ, థాకేనాకి శ్మశానే॥
కికొబ్ తాహార్ గుణ్, కపాలే జ్వాలేఆగున్.
సిద్ధితే ఒడ్డొనిపుణ్, ఆపన్ పర్ నా జానే॥
దీన అకించనే భాషే, తుష్టకొరి అశుతోషే
ఆనహ ప్రాణేర్ గౌరీ, నైలే మొరిబోపరాణే॥.

ఓ హిమవంతుడా! ఉమాదేవిని కైలాసమునుండి గొనివచ్చుట కెన్నడుబోదువు. ఆమెయొక్క వియోగమువలన దుఃఖము నిక భరింప లేవు. ఇక నెంతకాల మిట్లు జీవింతువు? నీ యల్లుడైన శివునిరీతి విని హృదయము తల్లడపడుచున్నది. భూతప్రేతములతో సఖ్యముగలిగి దిగంబరియై శ్మశానమున నుండును. ఆతని గుణముల నెన్ని చెప్పగలను? హస్తమునందు కపాలము. ఫాలమందు జ్వలించుచున్న యగ్ని. సిద్ధులయందు

మిక్కిలి నిపుణుడే కాని తన గమ్యస్థాన మెఱుగడు. నేనేమి చెప్పగలను? దీనుడను. భాషాజ్ఞాన మత్యల్పము. అల్పసంతోషిని. ఏమి స్తుతింపగలను? గౌరీదేవి ఈతని నడవడిఁజూచి మూర్ఛిల్లినదో లేక చనిపోయినదో చూచిరమ్ము.

౨

(కాళీ) ఆమి దినే దినే ఖుణ్ణమొనే
భబజ్వాలాయ్ జ్వలే మొరి।
దయాకోరో నిజగుణే ఆర్ జే జ్వాలాసయితే నారి॥
ఎఖోన్ డెఖాదిబేకి నాయి, కి కొరిబే బోల్ తాయి!
దీనే దర్శన్ చాయి, దోహాయి లాగే త్రిపురారి॥
శక్తిభక్తి కిఛుయి నాయి, నిజగుణే దేఖాచాయి
అకించనే దేహతాయి, శ్రీచరణే దయాకోరి.

కాళీ! నేను దినదినమును ఖిన్నమనస్కుడనై సంసారాగ్నిం బడి మరణించుచున్నాను. నీ సహజ దయావీక్షణముల నన్నుజూడుము. లేకున్న సహింపలేను. తల్లీ! ఏమిచేయుదునో చెప్పుము. దీనుడను. నీ దర్శనమే యపేక్షించుచున్నాను. త్రిపురారీ! నాకు నీ కరావలంబన మొసగుము. శక్తిగాని భక్తిగాని నా కావంతయు లేదు. నీ సహజగుణము చేతనే నన్ను దయచూచి యుద్ధరింపుము. తుచ్ఛమగు ఈ శరీరమును నీ మంగళచరణముల నుంచగోరుదును. కటాక్షింపుము.

౩

కాళి కోథాగో తారిణీ, త్రిగుణధారిణీ
కైలాసవాసినీ, హరమనోరమా, హరమనోమోహినీ
కృపాకోరో మాదీన్ పుణ్యహీనంచజనే, స్వగుణే నిస్తారిణీ;

# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

అపరాజన్మహరా, భక్తిముక్తి దాయినీ,
తారా బ్రహ్మమయీ, పరాత్పరీ, వాంఛాతీతప్రదాయినీ
(ఒగో మా)కే జానే తోమార్, మహిమా అపార్
అనన్త గుణాధార్, అవ్యక్త అచింత్యరూపిణీ,
కొతో యోగీ ఋషి యోగాసనే, దివానిశి ఏకమనే
భావియే నాపాయ్ ధ్యానే నిఖిల - బ్రహ్మాండ - జననీ
ఆమి దీన, జ్ఞానహీన, క్రియాహీన, భజనవిహీన
కి జాని మాహాత్మ్య, నిజగుణే త్రాణ్ కోరో దియే చరణ తరణీ॥.

కాళీ! త్రిగుణధారిణీ, కైలాసవాసినీ, హరమనోహారిణీ! హర మనోమోహినీ, స్వర్గతారిణీ, జన్మనిర్మూలినీ, భక్తిముక్తి దాయినీ, దుర్గా, బ్రహ్మమయీ, పరాత్పరీ, వాంఛాతీత ప్రదాయినీ ఎచ్చట నుంటివమ్మా? పుణ్యహీనుండగు ఈ దీనునిపై నీ కృపామృతమును వర్షింపుము. ఓ జననీ! నీయపారమగు మహిమ నెవ్వ డెఱుంగగలడు? అనంత గుణధారిణివి, అవ్యక్త అంచిత్యరూపిణివి. ఎందఱో యోగులు, ఋషులు యోగాసనములం దుపవిష్టులై, రాత్రిందినము లేకాగ్రచిత్తములతో భావించి భావించి నిఖిల బ్రహ్మాండ జననివగు నిన్ను ధ్యానమున గన్గొనలేకయున్నారుగదా! నేను దీనుడను, జ్ఞానరహితుడను, క్రియాహీనుడను, భజన విహీనుడను నీ మాహాత్మ్యమే మెరుంగగలను? నీ గుణములచేతనే నన్ను తరింపజేయుము.

౪

(ఒగో) శ్యామా మా ఆమార్
కేవల్ ముఖేర్ కొథా హోలో సార్
తుమి జే ఆమార్ సర్వస్వధన్,
తాతో అన్తరేర్ సహిత్ భావినా ఏక్ బార్.

# పరిశిష్టము

మొవే కోరి ఛాడి విషయవాసనా,
సార్ కోరి తవ నామ - ఉపాసనా,
కిన్తు కర్మ ఫేరే కి ఘూమాఘొలొ నా,
నిజగుణే ఏబేకోర్ మానిస్తార్.॥

ము నేరే బుఝూ ముజత్, కిషు తే నాహొాంయ్ నత
అకిఞ్చన పదాశ్రిత, యన్త్రణాసహె నాఆర్.

ఓ శ్యామజననీ! నా ముఖమున నీగుణగానమే యొప్పుచున్నది. నా సర్వస్వమగు నిన్నే అంతరంగమున భావించుకొను చున్నాను. మనస్సునందలి విషయవాసనను విసర్జించి నీ నామోపాసనమే చేయు చున్నాను. కాని కర్మమాత్రము మారినదికాదు. దయగాని నీ సుగుణ శేచ్ఛచే నన్నుద్ధరింపుము. మనస్సున నెంత తెలిసికొంటినో దానికి కొంచమైనను వినీతుడ నగుటలేదు. అల్పుడను. నీ చరణములనే ఆశ్రయించుకొన్నాను. ఇక నీ బాధను సహింపలేను.

౨

ఆజి ఏకి హేరి శుభ అపరూపదర్శన్!
ధరాంగో ఆసిలేన్ మా, కరుణామయీ, కరిప్పాషే ఆకర్షణ్ ॥

తప్తకాంచన వరణీ, హాస్యయుతా త్రినయనీ;
వదనే ఝుల్ కే కొతో బేశర్ మణి,
గలే హార్ గజముక్తా, రక్తవస్త్ర పరిధాన్॥

నానా అలంకార భూషిత, రూపే త్రిజగత్ మోహిత
దశభుజే సుశోభిత
ఆయుధ తన్త్రేరి శంఖచక్ర ధనుర్బాణ్॥
అమలకమల దళనిందిత - చరణతల.
కిబా తాంయ్ సునిర్మల్,
నఖర్ ఛటే ప్రకాశే సితశశి సుశోభన్॥

దిబానిశి ఒరూప్ హేరి, బాలా యువ ఆని కొరి,
జత్ సబ్ నరనారీ
పాశరిలా శోకదుఃఖసబే పుంకితమన్॥

బావేచిత గద్ గద్, దియే జబాకోకనద్,
పూజే మాయేర్, అభయపద్,
అతుల శోభాసమ్పద యోగిగణేర్ హృదయధన్
కలుషనాశియే తారా,
పుణ్యస్రోతే భాసాతే ధరా,
అకించనే దియేధరా,
దహీ ఒ రాఙ్గా చరణ్.

అమ్మా! నేడిట్టి యపురూప వేషముధరించి వచ్చితివేమి? మదగజము వాహనము, తప్తకాంచన దేహము, హాస్యయుతవదనము, త్రినయనములు, వదనమున ప్రకాశించుచున్న బేసరిమణి, కంఠమున ముత్యాలహారము, రక్తవస్త్రము పరిధానము. ఆహా! నానాలంకార భూషితవు త్రిజగన్మోహన రూపధారిణివి. దశభుజములచే విరాజిల్లు చున్నావు. శంఖచక్ర ధనుర్బాణాదికముల ధరించియున్నావు. పద్మములను ధిక్కరించు చరణయుగ్మము. ఆహా! ఎట్టి నిర్మలరూపము నఖములు శుభ్రచంద్రికలతో నెకసక్కెము లాడుచున్నవే! అమ్మా! ఎల్లప్పుడీరూపమునే ధరించి స్త్రీలను, పురుషులను, బాలురను వృద్ధులనందరను శోకదుఃఖములచే పులికింప జేయుచున్నావు గదా!

అతుల శోభాసంపదములను, యోగిగణ హృదయధనమును అభయప్రదములును అగు నీ పాదపద్మములను భావావేశమున గద్గదిక చెంది చెంగల్వలాది పుష్పములచే పూజింతును. నీవు కలుషములను నశింపజేసి పుణ్యస్రోతమున నీదలాడింప జేతువుకదా! తల్లీ నాకు నీ చరణకమలముల నాశ్రయ మొసంగుము.

---